

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమద్వరవరమునయే నమః

# విశిష్టాద్వైతమ్

(కీర్తిమూర్తి, మహావిద్వాన్, ఉ. వే. శ్రీమాన్ కార్పంగాడు వేంకటాచార్యస్వామివారి ద్రావిడవ్యాసానికి అనువాదం)

భగవద్రామానుజులు, శ్రీపెరుంబుదూర్



'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అఴగ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# విశిష్టాద్వైతమ్

"శాస్త్రాలలో మొట్టమొదటిది వేదం. వేదం అనేది ఈనాడు, నిన్న పుట్టినది కాదు. అనాది అయినది. ఒక పురుషుని చేత నిర్మింపబడినది కాదు. చాలా గొప్ప ప్రమాణం" అనేది అందరు వైదికులకు అభిమతమైన అభిప్రాయం. వైదికులు అందరూ వేదాన్ని నిత్య నిర్దోష మూల ప్రమాణంగా ఒప్పుకుంటున్నారు. వేదంలో "లక్ష్మీనాథుడైన సర్వేశ్వరుడే గొప్పతత్త్వం" అని, "లక్ష్మిని పురస్కరించుకొని అతని విషయంలో చేసే భక్తి ప్రపత్తులే పరమహితం" అని, "పరమపదంలో లక్ష్మీదేవితో కూడి ఉండే ఆ పరమ పురుషుని దర్శించి, ఆ స్వామికి దాస్యాన్ని చేసి, ఆనందింప చేయడం పరమ పురుషార్థం" అని తత్త్వహిత పురుషార్థాలు మూడు చెప్పబడ్డాయి. వీటిని సిద్ధాంతంగా గ్రహించే మన విశిష్టాద్వైత దర్శనం కూడా అనాది అయినది. ఇది నిన్న, నేడు పుట్టిన సిద్ధాంతం అని చెప్పడానికి లేదు. అయినప్పటికీ, కొన్ని కొన్ని సమయాలలో వేదం మొదలైన శాస్త్రాలు, వాటిలో చెప్పబడి ఉండే అర్థవిశేషాలు మనవంటివారు తెలుసుకోవడానికి సాధ్యం కానట్లుగా అదృశ్యమైపోతున్నాయి. ఈ విధంగా వేద వేదాంతాలకు అంతర్ధానం ఏర్పడిన కాలాలలో మహానుభావులు అవతరించి, వాటిని ప్రకాశింప జేస్తున్నారు. ఈ క్రమంలో, స్వామి భగవద్రామానుజులు మన పరమ వైదికమైన అనాది అయిన విశిష్టాద్వైత సిద్ధాంతం అనేది లోకంలో ప్రకాశాన్ని పొందకుండా, ఒక విధంగా అంతర్ధానాన్ని చెందిన కాలంలో, మన భాగ్యవశంచేత ఈ భూమిలో అవతరించి, వేదం అనే గొప్ప శాస్త్రంలో అంతర్భవించి ఉండే అర్థాలను శ్రీభాష్యం మొదలైన వేదాంత గ్రంథాలతోనూ, తమ ఉపదేశాల ద్వారా, అనుష్ఠానాల ద్వారా స్థాపించి, ప్రకాశాన్ని పొందజేసి వ్యాపింప చేశారు. అందువల్లనే అనాది అయిన ఈ వైదిక సిద్ధాంతం "భగవద్రామానుజ దర్శనమ్" అని పిలువబడుతున్నది.

మొట్టమొదట భగవానుడు నారాయణుడే విష్ణురూపంలో అవతరించాడు. అతడు లోకాన్ని నిర్వహించేటప్పుడు పలు విధాలుగా అవతారాలను ఎత్తి, పలు విధాలైన ఉపదేశాలను చేశాడు. ఆ నారాయణుడే బుద్ధరూపంలో అవతరించి, " వేదం ప్రమాణం కాదు" అని, "వేదంలో చెప్పబడిన ధర్మాలు అనుష్ఠించదగినవి కావు "అని ప్రచారం చేసినట్లుగా మనం గ్రంథాల మూలంగా తెలుసుకుంటున్నాము. ఆ బుద్ధునకు నలుగురు ప్రధాన శిష్యులు. వారిలో బుద్ధుని ఉపదేశం చక్కగా ఫలించినది మాధ్యమికుడు అనే శిష్యుని విషయంలో– అని చెప్పవచ్చు. ఈ మాధ్యమికుని మతంలో "ఏమీ లేదు. సర్వం శూన్యం" అనేదే సిద్ధాంతం. " సర్వం శూన్యం "అని చెప్పే మాధ్యమికుని పక్షం వ్యాసుని చేత బ్రహ్మ సూత్ర ప్రబంధంలో ఖండింపబడినది. అతడు చెప్పే యుక్తి, అతని మతం –అనే వీటిని

వినేవారికి వాటిని వింటూనే ఉండాలి అని అనిపిస్తుంది. " ఏమీ లేదు, అంతా శూన్యం" అని చెబుతున్నావే! ఈ విధంగా నీవు చెప్పడానికి నీవు ఒక ప్రమాణాన్ని చూపించాలి కదా. ఒక ఆధారాన్ని చూపించి కదా ఒకడు తన సిద్ధాంతాన్ని నిరూపించవలసి ఉన్నది. నీవు ఈ విధంగా చెప్పడానికి ఏమి ఆధారం? ఏమి యుక్తి? అని అడిగితే దానికి అతడు "ఒక వస్తువు ఉన్నది" అని చెప్పేవాడే దానికి ప్రమాణాన్ని కానీ, ఆధారాన్ని కానీ, , యుక్తిని కానీ చూపించాలి. "ఏమీ లేదు, అంతా శూన్యం" అని చెప్పేవారికి ఏ విధమైన ప్రమాణాన్ని, ఆధారాన్ని, యుక్తిని చూపవలసిన అక్కరలేదు– అని అంటాడు. ఇటువంటి మతం లోకంలో ప్రచారాన్ని పొందిన కాలంలో ఆది శంకరులు ఆవిర్భవించారు –అని చరిత్ర. ఆదిశంకరులు చేసిన ఉపనిషత్ భాష్యాలు, బ్రహ్మసూత్ర భాష్యం, గీతా భాష్యం మొదలైన గ్రంథాలను చూసినప్పుడు, ఆ గ్రంథాలలో చాలాచోట్ల ఈ మాధ్యమికుని పక్షాన్ని వారు ఖండనం చేసి, తమ అద్వైత సిద్ధాంతాన్ని స్థాపించడం గమనించవచ్చు. దీనిని గూర్చి మొదట కొంచెం సంగ్రహంగా విజ్ఞాపన చేస్తాను.

"ఏమీ లేదు" అని సిద్ధాంతం చేసే మాధ్యమికుని చూచి "లోకంలో పలు పదార్థాలు ఉన్నాయి. ఒక్కొక్క పదార్థాన్ని వేరువేరుగా మనం చూస్తున్నాము. ఇతడు మానవుడు, ఇది రత్నం, ఇది మార్గం, ఇది కోవెల అని మన అనుభవంలో పలు వస్తువులు ఉన్నట్లుగా తోస్తున్నది. నీవు దీనిని ఏ విధంగా నిర్వహిస్తావు? ఈ అనుభవాన్ని నీవు ఏ విధంగా సమర్థిస్తావు ? "అని ఆదిశంకరులు అడిగారు. దానికి మాధ్యమికుడు " ఒక వస్తువు ఉన్నా తోచవచ్చు, లేకపోయినా తోచవచ్చు. ఒక వస్తువు ఉన్నపుడే తోచాలి– అనే నియమం ఏమీ లేదు. "తోచినందువల్లనే ఒక వస్తువు ఉన్నది", అని నిశ్చయించడానికి లేదు. కొన్ని చోట్ల దారం ఉన్నది. అది సర్పం వలె కనిపిస్తున్నది. ముత్యపు చిప్ప అనేది వెండి వలె కనిపిస్తున్నది. అయితే, పాము. వెండి మొదలైన వస్తువులు లేవు. అందుచేత ఉండే వస్తువే కనిపిస్తున్నది– అనేది లోకానుభవంలో లేదు. లేనప్పుడు కూడా తోచవచ్చు ఈ విధంగానే, లోకం అనేది నిజానికి లేదు. లేని వస్తువే లోకంగా తోస్తున్నది" అని వాదిస్తాడు.

దీనికి ఆదిశంకరులు "లోకం నిజానికి లేదు. లేకపోయినప్పటికీ అసత్యమైన అది ఉన్నట్లుగా తోస్తున్నది "అని నీవు చెబుతున్నావే! దానిని మేము కూడా ఒప్పుకుంటాము. అయితే, దారం ఉన్నచోటనే అది పాము తోస్తుంది. లేని వస్తువు అయిన వెండిగా దర్శనం ఇస్తున్నది. లేని వస్తువు తోచేటప్పుడు అన్ని చోట్ల ఆ విధంగా కనిపించడం లేదు. దారం అనే వస్తువు ఉండే చోటలో మాత్రమే అది పాము అని కనిపిస్తున్నది. ముత్యపు చిప్ప ఉండే చోటలో మాత్రమే అది వెండిగా కనిపిస్తున్నది. అందుచేత, ఈ పాము, వెండివంటివిగా తోచడానికి దారం, ముత్యపు చిప్ప వంటి వస్తువులు అధిష్ఠానమై, అంటే, ఆధారమై

ఉన్నాయి. ఒకచోట దారం అనేదే లేదు అంటే, అక్కడ పాము అనే అసత్యమైన దర్శనం కలుగడం లేదు. ఒకచోట ముత్యపు చిప్ప అనే వస్తువే లేకపోయినట్లయితే, అక్కడ వెండి అనే భానం, అసత్యమైన అనుభవం కలుగడం లేదు. దారం, ముత్యపు చిప్ప– అనేవి ఉన్నచోట మాత్రమే ఈ విధమైన అసత్యమైన దర్శనం కలుగుతున్నందున, అధిష్ఠానం అనే ఒక వస్తువు తప్పక ఉండాలి– అనే విషయాన్ని తప్పక ఒప్పుకోవాలి. ఆ అధిష్ఠానం అని చెప్పబడే వస్తువే బ్రహ్మం. బ్రహ్మన్ని సత్యంగా ఒప్పుకోవాలి. "లోకం వాస్తవంగా లేదు" అని నీవు చెప్పిన విషయాన్ని మేము కూడా ఒప్పుకుంటున్నాం. అయితే, అధిష్ఠాన వస్తువు అయిన బ్రహ్మంలోనే లోకం అనేది తోస్తున్నది. లేకపోయినప్పటికీ ఉన్నట్లుగా తోస్తున్నది" అని అంటూ మాధ్యమికుని పక్షాన్ని ఖండించి, "బ్రహ్మం అనే వస్తువు అవశ్యం సత్యమైన వస్తువుగా అంగీకరించాలి" అని సమాధానాన్ని పలికి, తమ సిద్ధాంతమైన అద్వైతాన్ని స్థాపించారు. వారి బృహదారణ్యకోపనిషద్భాష్యాన్ని గమనిస్తే, ఈ విషయాలన్నీ చక్కగా బోధపడతాయి.

ఈ విధంగా మాధ్యమికునకు, ఆదిశంకరులకు మధ్య ఏ రీతిలో వాదం జరిగిందో, ఆ క్రమంలోనే ఆదిశంకరులకు, స్వామి శ్రీరామానుజులకు మధ్య వాదం జరిగింది. అది ఏమంటే, దారం లేని చోట సర్పం అనే భానం కలుగడం లేదు. దారం ఉండే చోట మాత్రమే అది సర్పం అని తోస్తున్నది. అందుచేత దారాన్ని సత్యమైన వస్తువుగా అంగీకరించాలి. ఇదే విధంగా, బ్రహ్మం అనే అధిష్ఠాన వస్తువును తప్పకుండా అంగీకరించాలి. బ్రహ్మంలోనే లోకం అసత్యంగా తోస్తున్నది– అనే వాదం చేసే ఆదిశంకరుల దారిలోనే వెళ్లి, విశిష్టాద్వైత సిద్ధాంత స్థాపనాన్ని మన స్వామి శ్రీరామానుజులు చేశారు.

"దారాన్ని చూసేటప్పుడు పాము అనే అసత్యమైన భానం కలుగుతున్నది. అందుచేత దారం అనే వస్తువును సత్యంగా ఒప్పుకోవాలి" అనే వాదం చేసే శంకరులను చూచి, " అయితే, ఇంకొక చోట సర్పం అనే వస్తువు సత్యంగా లేకుండా ఉన్నట్లయితే, దారం ఉండే కోట కూడా సర్పం అనే భానం కలుగుతుందా ?" అని మన స్వామి శ్రీరామానుజులు శంకరులను ప్రశ్నించారు. "జగత్తు సత్యంగా ఉంటేనే బ్రహ్మను అధిష్ఠాన వస్తువుగా అంగీకరించటానికి సాధ్యం అవుతుంది" అని శంకరులు పోయే దారిలోనే వెళ్ళి, శంకరులకు ఇటువంటి యుక్తిని చూపి, " బ్రహ్మన్ని వలె లోకాన్ని కూడా సత్యమని అంగీకరించాలి " అని అన్నారు, శ్రీరామానుజులు.

ఈ వాదం ఒక పెద్ద వాదం. దీనిని గూర్చిన గ్రంథాలు చాలా ఉన్నాయి. ఈ వాదాన్ని చక్కగా తెలుసుకోవాలి అంటే, ఇంకా ఇంకా చాలా ప్రశ్నలు వస్తాయి వాటికి

పరిహారాలను గమనించాలి. ఈ రీతిలో శ్రీరామానుజులు అనుగ్రహించిన శీభాష్యం మొదలైన గ్రంథాలను ఒక ఆచార్యుల మూలంగా చక్కగా అభ్యసించి గ్రహించి అనుభవిస్తే, మన స్వామి శ్రీరామానుజుల మేధావిలాసం, వారు మనకు చేసిన మహోపకారాలు అత్యాశ్చర్యకరాలుగా భాసిస్తాయి. అందరూ అనుభవించదగిన రీతిలో ఇప్పుడు కొన్ని విషయాలను విజ్ఞాపన చేస్తాను.

మొదట ఒక విషయాన్ని గమనించాలి. మాధ్యమికునకు వేదాన్ని పురస్కరించుకుని ఏ విషయాన్ని స్థాపించవలసిన ఆవశ్యకత లేదు. ఆది శంకరులు వైదికులు అయినందున, వేదాన్ని ప్రమాణంగా గ్రహించే తమ సిద్ధాంతాన్ని నిర్వహించవలసిన ఆవశ్యకత వారికి ఉన్నది. ఈ విధంగా వేదాన్ని ప్రమాణం అని గ్రహించి, అద్వైతమే తత్త్వం అని పలికి, వేదవ్యాలను నిర్వహించేటప్పుడు కొన్ని విధాలయిన శ్రమలు శంకరులకు కలుగుతున్నాయి. శంకరులు వైదికులు. మన స్వామి శ్రీ రామానుజులు కూడా వైదికలే. వైదికులు అయినందున, వేదం మొదలైన శాస్త్రాలను ప్రమాణంగా చూపించే, తత్త్వసిద్ధాంతాలను స్థాపించవలసినవారుగా వీరు ఉన్నారు. ఈ విధంగా వేదాన్ని ప్రమాణంగా చూపించి, వేదవాక్యాలకు అర్థాన్ని తెలియజేసి అద్వైత సిద్ధాంతమే వేదవాక్యాలు తెలియజేస్తున్నాయి అని నిరూపించవలసినవారు, శంకరులు. ఆ విధంగానే, విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని వేదవాక్యాలు తెలుపుతున్నాయి– అని స్థాపించవలసినవారు, మన స్వామి శ్రీరామానుజులు. ఈ రీతిలో ఇద్దరికీ ఏర్పడి ఉండే వాద ప్రతివాదాలను మనం ఒక ఆచార్యుల మూలంగా చక్కగా అభ్యసించి తెలుసుకొని ఆనందించాలి. వేదాంతవాక్యాలకు అర్థాన్ని చెప్పి వేదతాత్పర్యం ఇదే– అని నిర్ణయించడానికి మన స్వామి శ్రీరామానుజులు పరిగ్రహించిన దారులు చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి మనం అందరం ఒక భాగ్య విశేషం చేత భగవద్రామానుగ దర్శనాన్ని చేరినవారుగా ఉన్నారు మనసులో పెట్టుకొని శ్రీరామానుజులు అవతరించారు. గొప్ప గొప్ప శాస్త్రార్థాలను తమ అనుష్టానాలతో, ఉపదేశాలతో మనకు తెలియజేశారు. వారి జ్ఞాన సంతతిలో, శిష్య పరంపరలో అందరూ మహనీయులు అవతరించి వీటిని అనుసరించారు. అయితే, కాలక్రమేణ ఈ అర్థవిశేషాలు తప్పకుండా తెలుసుకోవలసిన అక్కర కలిగిన పరంపరలో పుట్టిన మనమే వీటిని తెలియకుండా విడచి పెట్టేశాము. మన సమాజంలోనివారుమన రామానుజులు అనుగ్రహించిన గ్రంథాలను మనం తప్పక తెలిసికోవాలి. యథాశక్తి ఈ గ్రంథాలలో చెప్పబడి ఉండే అర్థాలను, ఉపదేశాలను ఆచరించాలి– అనే భావం ఇంచుమించుగా ఎవరికీ లేదనే చెప్పవచ్చు. నూటికి 99 మందికి ఈ భావం లేదు –అని అంటే, పదివేల మందిలో నూరు మందికి ఉన్నది – అనే అర్థం వస్తుంది. ఒక లక్ష మందిలో వేయిమందికి ఈ భావం ఉన్నది–

అనే అర్థం వస్తుంది. అయితే, లోకానుభవంలో యథార్థమైన స్థితి ఏమంటే, ఈ పరిమితిలో కూడా లేదు. స్వామి చాలా శ్రమపడి మన క్షేమం కోసం ఎన్నో కార్యాలను చేశారు. మన కోసం వారు అనుగ్రహించిన గ్రంథాలను అనుభవించడం కోసం పెట్టి పుట్టిన మనం వాటిని అనుభవించకుండా కోల్పోతున్నాము. "కోల్పోయామే– అనే బాధ కూడా లేకుండా" అని సంప్రదాయంలో ఒక మాటను చెప్పడం ఉన్నది. " కోల్పోయామే! " అనే బాధ కూడా మన వారిలో లేదు. ఈ దుర్గతిని మనం తప్పక తీర్చుకోవాలి. ఈ స్థితి లేకుండా మన స్వామి భగవద్రామానుజుల గ్రంథాలను, ఉపదేశ సూక్తులను తెలిసికొని అనుభవించి, వాటిని ఆచరణలో కూడా యథాశక్తి గ్రహించే రీతిలోని స్థితికి మనం వచ్చి చేరాలి.

మన శ్రీవైష్ణవ సమూహంలో ఉండే ఒక కొరతను గూర్చి మొదట చెబుతున్నాను. వేదవాక్యాలకు శంకరులు ఒక విధంగా అర్థాన్ని చెప్పారు. మన స్వామి శ్రీరామనుజులు కూడా తాత్పర్యార్థాలను అనుగ్రహించారు. లోకంలో, భాషాంతరాలలో పలు విధాలుగా గ్రంథాలు ఏర్పడుతున్నాయి. కొందరితో మనం మెలుగుతున్నాము మనకు లోకంలో ఉండేవారితో ఒక విధంగా సంబంధం ఏర్పడుతున్నది. ఆ సమయాలలో కొందరు "శంకరులకు జ్ఞానం అపారం, శ్రీ రామానుజులకు హృదయం గొప్పది" అని ఈ విధంగా చెబుతున్నారు. శ్రీ రామానుజులకు హృదయం చాలా గొప్పది అంటే, "జ్ఞానం అంత గొప్పది కాదు" అని చెబుతున్నట్లుగా అవుతుందా? అని నావంటి వారికి సందేహం కలుగుతుంది. ఆదిశంకరుల జ్ఞానాన్ని, శ్రీరామానుజుల జ్ఞానాన్ని తటస్థంగా ఉండి చూడాలి. మనకు ఆచార్యులు అని మన ఆచార్యుల ప్రభావాన్ని వ్యక్తం చేస్తున్నట్లుగా భావించకూడదు. మనకు శాస్త్రాలలో పరిచయం ఉన్నది అని తెలియజేయడానికి కాదు. ఏదో కొంచెం శ్రీరాముని చరిత్రనూ వినడం, శ్రీకృష్ణుని చరిత్రను వినడం, ఆళ్వారుల శ్రీ సూక్తులను అక్కడ అక్కడ కొంచెం అనుభవించడం, లేక, రహస్య గ్రంథాలలో సారంగా ఏవో కొన్ని విషయాలను చెబితే వినడం– అని ఈ విధంగానే మన చరిత్ర ఉన్నది. మన పూర్వాచార్యుల పరంపరలో మధ్యమణిస్థానంలో ప్రకాశిస్తూ ఉండే శ్రీరామానుజులు అనుగ్రహించిన గ్రంథాల లో మనకు సంబంధం ఏమాత్రం లేద– అని మన స్థితి ఉన్నది. శ్రీ రామానుజుల మేధావిలాసం చాలా ఆశ్చర్యాన్ని కలిగించేదిగా ఉన్నది. స్వామి తమ మనసులోని అభిప్రాయాన్ని వ్యక్తం చేసే అందం, స్వామి యొక్క ఉపదేశ సూక్తులు, వ్యాఖ్యానం అనుగ్రహించే సామర్థ్యం, వారు పోయే దారి వారి గంభీరమైన, దీర్ఘమైన దృష్టి –అనే వీటిని అనుభవించడంలో పొందే ఆనందం ఉన్నదే, అది వాచామగోచరం. దానిని అనుభవించే కొంతవరకు తెలియాలి. ఇది అభిమానంతో చెప్పే మాట కాదు నూటికి వేయి రెట్లు వాస్తవమైన మాట. మన స్వామి శ్రీరామానుజులు పోయే దారి అందరికీ తెలియాలి. వేదవాక్యాలకు అర్థాన్ని వివరించి, వారు

అక్కడ అక్కడ విశేషాలను అనుగ్రహించే క్రమాన్ని మన పూర్వాచార్యులు చక్కగా అనుభవించి, వాటిని మనం చక్కగా తెలిసికొని అనుభవించేటట్లుగా పలు గ్రంథాలలో వివరించారు.

ప్రసంగవశాత్తు ఒక విషయాన్ని విజ్ఞాపన చేస్తాను నమ్మాళ్వార్లు తిరువాయ్ మొళి ప్రబంధంలో భగవంతుని పరత్వాన్ని స్థాపించే రీతి చాలా అందంగా, చాలా ఆశ్చర్యకరంగా ఉంటుంది. " పేశనన్ట శివనుక్కుమ్ పిరమన్ తనక్కుమ్ పిఱర్ క్కుమ్ నాయకన్ అవనే, కపాలనన్ మోక్కత్తు క్కండు కొణ్ మిన్" (పరదైవంగా చెప్పబడే శివునకు బ్రహ్మకు ఇంకా ఇతరులకు కూడా నాయకుడు ఆ శ్రీమన్నారాయణుడే. కపాల మోక్షాన్ని గమనించండి) అని అన్నారు నారాయణుని పరత్వాన్ని అందరూ అంగీకరించే విధంగా శ్రీసూక్తిని అనుగ్రహించే క్రమం చాలా ఆశ్చర్యకరమైనది. లోకంలో భగవంతునితో పాటు ఇద్దరు దేవతలను ముఖ్యంగా చెబుతున్నారు. బ్రహ్మయొక్క తలలలో, ఒక తలను శివుడు గిల్లి వేశాడు. తండ్రి తలను గిల్లినప్పుడు ఆ కపాలం శివుని చేతికి అంటుకున్నది. శివుడు కపాలి అయ్యాడు. ఆ దోశషం తీరడం కోసం భగవంతుని కృప అతనికి అక్కర అయినది. భగవంతుని కృప చేత శివుడు ఆదోషాన్ని పోగొట్టుకున్నవాడు అయ్యాడు. ఈ విధంగా, ఈ ముగ్గురిలో, ఒకరు తలను పోగొట్టుకున్నారు, ఇంకొకరు తలను గిల్లివేసి కపాలి అయ్యారు. ఇంకొకరు ఆ దోషాన్ని పోగొట్టారు. ఈ ముగ్గురిలో ఎవరు పర దైవం ?అనే విషయాన్ని మీరే చెప్పండి నిశ్చయి అని ఆళ్వారులు లోకంలోనివారిని చూచి అడుగుతున్నారు. ఆళ్వార్ల ఉపదేశాలు అన్నీ ప్రతివాదులు కూడా అంగీకరించేటట్లు ఏర్పడి ఉంటాయి. ఈ విధంగానే మన స్వామి శ్రీరామానుజుల నిర్వహాలు అన్ని అందరూ అంగీకరించే రీతిలో ఏర్పడి ఉన్నాయి. శ్రుతివాక్యాలకు అర్థాన్ని అనుగ్రహించేటప్పుడు, శంకరులు చెప్పే విధానాన్ని, శ్రీరామానుజులు చెప్పే విధానాన్ని చెబుతాను. విశిష్టాద్వైతమే వేద తాత్పర్యం అనే విషయాన్ని మన స్వామి శ్రీరామానుజులు ఏ విధంగా, ఏ రీతిలో అందరూ అంగీకరించేటట్లు అనుగ్రహించారు? అనే సంగతిని మనం అనుభవించవచ్చు.

అద్వైతాన్ని గూర్చి తెలుసుకోకుండా విశిష్టాద్వైతాన్ని గురించి తెలుసుకోవడం సాధ్యం కాదు. శ్రీ రామానుజులు, తాము అనుగ్రహించిన గ్రంథాలలో అద్వైత సిద్ధాంతాన్ని పూర్వపక్షంగా అనువదించిన సందర్భాలను గమనిస్తే, అద్వైతాన్ని గూర్చిన స్పష్టమైన, లోతైన జ్ఞానం వారికి చాలా ఆశ్చర్యకరంగా భాసించడాన్ని మనం గమనించవచ్చు. ఈ సందర్భంగా అద్వైత సిద్ధాంతానికి సంబంధించిన ముఖ్యమైన అంశాలను ఎంతవరకు స్పష్టంగా వీరు అనుగ్రహించారు? అనే విషయం అర్థమవుతుంది. అద్వైపుల గ్రంథాలలో

కూడా ఇంత స్పష్టంగా అందంగా అనుగ్రహించే క్రమాన్ని చూడడం సాధ్యం కాదు. ఇంత స్పష్టంగా చెప్పదగిన శ్రీ రామానుజుల సామర్థ్యాన్ని మనం అనుభవించి తీరవలిసినదే.

చాందోగ్యోపనిషత్తులో "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్" అనే ఒక వాక్యం ఉన్నది. . సద్విధ్యా ప్రకరణంలో తండ్రి అయిన ఉద్దాలకుడు పుత్రుడైన శ్వేతకేతువును చూచి చెప్పే ఈ వాక్యానికి శంకరుల వ్యాఖ్యానాన్ని తెలియజేస్తాను. శ్రీవైష్ణవులు అని అనడం కోసం విశిష్టద్వైత సిద్ధాంతాన్ని ఆదరించవద్దు. నారాయణుని పరత్వాన్ని నమ్మాళ్వారుల సూక్తిలో తెలిసే టప్పుడు అది ఏ విధంగా అందరికీ మనస్సులో అంగీకరించేటట్లు చక్కగా పడుతున్నదో, ఆ విధంగానే, స్వామి శ్రీరామానుజులు ఈ శ్రుతి వాక్యానికి అనుగ్రహించే అర్థం అందరూ అంగీకరించేటట్లు మనసులో పడుతుంది. వారు చెప్పేదానిని చెబుతాను. వీరు చెప్పే దానిని చెబుతాను. వీరు చెప్పేదానికి ఆధారాలను చూపించారు. దానిని కూడా తెలియజేస్తాను. ఆ విధంగా పల్కి అనుభవించేటప్పుడు, శ్రుతి వాక్యాలకు అర్థాన్ని అనుగ్రహించే సామర్థ్యం, బ్రహ్మసూత్రాలకు భాష్యం అనుగ్రహించడానికి తగిన మేధావిలాసం, గొప్పతనం వీరికి ఒక్కరికే ఉన్నది– అనే విషయాన్ని తటస్థంగా ఉందడి మనం మనస్సులో గ్రహించవచ్చు.

విషయం ఏమిటి అంటే, మాధ్యమికుని మతం అనేది లోకంలో ప్రచారాన్ని పొంది, ప్రసిద్ధంగా ఉన్న కాలంలో, " బ్రహ్మం లేదు, ఈ లోకం లేదు" అనే సిద్ధాంతం అంతటా వ్యాపించినది. దానికి తరువాత, ఆది శంకరుల కాలంలో, " బ్రహ్మం ఉన్నది. అయితే, లోకం లేదు" అనే మతం ప్రచారాన్ని పొందినది. శ్రీరామానుజుల కాలంలోనే "బ్రహ్మం ఉన్నది, లోకం ఉన్నది, బ్రహ్మం కంటే విలక్షణమైన వస్తువులు కూడా ఉన్నాయి. బ్రహ్మానికి దివ్య మంగళ విగ్రహం ఉన్నది. బ్రహ్మకు కళ్యాణ గుణాలు ఉన్నాయి. బ్రహ్మానికి శరీరంగా ఉందే చేతనా చేతనాలు అనే ఈ ప్రపంచం ఉన్నది. ఆ బ్రహ్మమే నారాయణుడు" అనే అనాదియైన వైదిక సిద్ధాంతం స్థాపితం అయినది.

"బ్రహ్మం ఉన్నది, అయితే, అది నిర్విశేషం. దానికి రూపం లేదు. గుణాలు లేవు. దానికంటే భిన్నమైన వస్తువు అని చెప్పదగినది ఏదీ లేదు. అంటే, జీవుడు అని చెప్పబడే వస్తువు లేదు అచిత్తు అని చెప్పబడే వస్తువు కూడా లేదు" అనేది శంకరుల వాదం.

చేతులు, కాళ్లు మొదలైన అవయవాలతో కూడి ఉండే పిండం శరీరం. ఇది అచిత్తు. దీనివలె ఘటం, వస్త్రం మొదలైనవి అచేతన పదార్థాలు. అంటే, జ్ఞానం లేని వస్తువు అని అర్థం. బ్రహ్మాన్ని జ్ఞానం లేని అచేతనాన్ని గ్రహించి చూచి, బ్రహ్మం కంటే భిన్నమైన వస్తువు అయినది ఏదీ లేదు, బ్రహ్మంలో జ్ఞానం, శక్తి మొదలైన గుణాలు లేవు. బ్రహ్మానికి

దివ్య మంగళ విగ్రహం లేదు. బ్రహ్మం మాత్రం ఉన్నది. అది శుద్ధం. (అంటే, నిర్విశేష చిన్మాత్ర తత్త్వం) " అనేది అద్వైతుల సిద్ధాంతం.

"బ్రహ్మం విశిష్టతత్వం" అనేది మన స్వామి శ్రీరామానుజుల మతం. విశిష్టం అనేదానికి "కూడి ఉన్నది" అని అర్థం. బ్రహ్మం తన కంటే భిన్నమైన వస్తువు అయిన అచేతన వస్తువుతో కూడి ఉన్నది. తనతో సమానమైన వస్తువులు అయిన జీవాత్మలతో కూడి ఉన్నది. దానికి జ్ఞానం, శక్తి మొదలైన కళ్యాణ గుణాలు ఉన్నాయి– అనేది విశిష్టాద్వైత మతం. "గుణాలతో, దివ్యమంగళ విగ్రహంతో, చేతనా చేతనాలతో కూడి ఉండే వస్తువు ఉన్నది, అదే బ్రహ్మం దానికంటే భిన్నమైన వస్తువు ఇంకొకటి ఏదీ లేదు" అనేది విశిష్టాద్వైత మతం.

లోకంలో సంగీతాన్ని గూర్చిన చర్చలు చాలా ఉన్నాయి. సంగీత విద్వాంసుల మధ్యలో తాళాన్ని గూర్చిన, స్వరాలను గూర్చిన, కొన్ని రాగ స్వరూపాలను గూర్చిన, అనేక వివాదాలు ఉన్నాయి. చర్చ అని విధ్వాంసులు ఒక గోష్టిగా చేరుతారు. వారు వారు తగిన ఆధారాలతో "ఈ తాళమే ఉండాలి, ఈ స్వరమే ఉండాలి, ఈ విధంగానే రగస్వరూపం ఉండాలి " అని వాదాన్ని చేస్తారు. పూర్వపక్ష సిద్ధాంతాలు వారి మధ్యలో సంభవిస్తున్నాయి. ఒక మద్యస్థుని నియమించి ఏర్పాటు చేసుకొంటారు. సంగీతానికే ఇంత వివాదాలు సంభవిస్తూ ఉంటాయి. సంగీతాన్ని గూర్చిన ప్రచారం చేసే చోటనే నేను నివసించాను. అందువల్ల నాకు ఈ విషయం తెలుసు. మైసూర్ సంస్థానంలో కొంచెం కాలానికి ముందు వరకు ఇటువంటి చర్చలు ఉండేవి. . శాస్త్ర సంబంధమైన చర్చలు కూడా ఉండేవి. ఈ విభాగంలో ఇవి చాలా ప్రసిద్ధం. బరోడా సంస్థానంలో కూడా చాలా అందంగా విద్వాంసుల వాక్యార్థ సదస్సులు జరిగేవి– అని ఇతరులు చెప్పగా విన్నాను. ఇప్పుడు ఏ చోట కూడా ఇటువంటి చర్చలు జరగడం లేదు.

"బ్రహ్మం మాత్రమే ఉన్నది, వేరు ఏమీ లేదు" అనేదానికి "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్" అనే శ్రుతి వాక్యాన్ని ఆధారంగా శంకరులు చూపించారు. మన స్వామి శ్రీరామానుజులు కూడా "వేదాంతంలో చెప్పబడే పరతత్త్వం చేతనా చేతనవిశిష్ట బ్రహ్మమైన నారాయణుడే. అతడు తప్ప, రెండవ వస్తువు లేదు" అనే వాస్తవాన్ని ఈ వాక్యాన్ని చూపించే నిరూపించారు. భగవానుని గూర్చిన కొన్ని తత్త్వాలను మనకు చక్కగా తెలిపే రీతిలో ఈ వాక్యం ఏర్పడి ఉన్నది. దీని వాస్తవమైన అర్థాన్ని అనుభవించడానికి ముందు, ప్రకరణానికి అనుగుణంగా మనం తప్పకుండా అనుభవించవలసిన కొన్ని అర్థాలను మొదట ఒక విధంగా విజ్ఞాపన చేస్తాను.

## వేదం – విష్ణుపరత్వం

మనం అవలంబించే విశిష్టాద్వైత సిద్ధాంతం శ్రీవైష్ణవ సంప్రదాయం, భగవద్రామానుజ దర్శనం అనే పేర్లతో ప్రసిద్ధి పొంది వెలుగుతున్నవి. చాలా ప్రాచీనమైన దర్శనానికి భాగవత మతం అనే ప్రసిద్ధి ఉన్నది. శ్రియఃపతి అయిన సర్వేశ్వరుడు గొప్ప దైవంగా భావించే సంప్రదాయం కనుక ఈ సంప్రదాయానికి చెందిన మనం లక్ష్మీనాథునకు కల గొప్పతనాన్ని మొట్టమొదటగా తెలుసుకోవలసినది ఆవశ్యకమై ఉన్నది. వేదం మొదలైన శాస్త్రాల సహాయంతోనే మనం పరమాత్మ యొక్క స్వభావాలు, గొప్పతనాలు మొదలైన వాటిని తెలుసుకోవడానికి సాధ్యం అవుతుంది. భగవంతుని గూర్చిన తత్త్వాలను వేదం మొదలైన శాస్త్రాలు పలు విధాలుగా మనకు తెలియజేస్తున్నాయి.

“చేతనాచేతనాత్మకమైన ఈ జగత్తు అనేది కార్య వస్తువు. శ్రీమన్నారాయణుడు కారణ వస్తువు. అందుచేత ఆ శ్రీమన్నారాయణుడు పరత్వాన్ని కలిగినవాడు “అని తెలిపే శాస్త్రాలు ఒక విధంగా ఏర్పడి ఉన్నాయి.

“ఈ ప్రపంచం భగవంతుని సొత్తు. అతని వశంలో ఉండేది. భగవంతుడు స్వామి. అంటే, భగవంతుని అభిప్రాయానికి అనుగుణంగా ఇది అతనిచే వినియోగం చేసుకోవడానికి వీలైనది” అనే వాస్తవాన్ని తెలియజేయడం ద్వారా వేరొక రీతిలో అమరి ఉన్నాయి.

ఒక ఉన్నతమైన చేతన వస్తువును మిక్కిలి ప్రీతితో చింతించే చింతనకు భక్తి అని పేరు. చేతనాచేతనాత్మకమైన వస్తువునే “నా దగ్గర నీవ తప్ప వేరొక పుణ్యం ఏదీ లేదు. నన్ను రక్షించే వారు నీవు తప్ప ఇక ఎవరూ లేరు” అనే తన స్థితిని గూర్చి తెలిపి, శరణు పొందడానికి ప్రపత్తి అని పేరు. ఈ విధంగా ఉండే భక్తి ప్రపత్తులను మోక్షం అనే ప్రాప్యాన్ని కోరి ఏ విషయంలో చేయాలో ఆ విషయం చాలా ఉన్నతమై ఉంటుది. . ఏ వస్తువు మోక్షం అనే ప్రాప్యాన్ని పొందడానికి అడ్డుగా ఉండే వాటిని పోగొట్టి మంచిని కలిగిస్తుందో అది చాలా ఉన్నతమైనదై ఉంటుంది. భక్తి, ప్రపత్తి అనే వీటిని చేయవలసిన విషయం, మోక్షం అనే వాక్యాన్ని పొందినప్పుడు పొందబడే విషయం ప్రపంచాన్ని పొందడానికి అడ్డుగా ఉండే వాటిని పోగొట్టే విషయం లక్ష్మీనాథుడే అనే వాస్తవాన్ని తెలియజేసే క్రమంలో లక్ష్మీనాథుని పరత్వాన్ని తెలిపే శాస్త్రాలు ఇంకొక రీతిలో ఏర్పడి ఉన్నాయి.

పరతత్వాన్ని గూర్చిన జ్ఞానాన్ని ప్రత్యక్షం, అనుమానం అనే ప్రమాణాలతో మనం పొందడానికి సాధ్యం కాదు అని, దానిని శాస్త్రాన్ని పురస్కరించుకునే మనం పొందాలి అని శ్రీవేదవ్యాసుల వారు బ్రహ్మసూత్ర ప్రబంధంలో అనుగ్రహించారు. భగవంతుడు గీతలో “వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః” (15– 15) (అన్ని వేదాల చేత తెలియబడే తత్త్వాన్ని నేనే

“అని స్పష్టంగా పలికాడు. భగవంతుని గూర్చి తెలియజేసే వేదం అనేది కర్మకాండం అని, బ్రహ్మకాండం అని రెండు విభాగాలను కలిగి ఉన్నది. కర్మకాండలో చెప్పబడే కర్మల చేత ఆరాధింపబడేవాడుగా (వరుణుడు, ఇంద్రుడ వంటి దేవతలకు అంతర్యామిగా) విష్ణువే ప్రకాశిస్తున్నాడు. కర్మకాండం వలె కాకుండా, బ్రహ్మకాండం అనేది నేరుగానే భగవంతుని గూర్చి తెలుపుతున్నది. “ యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి యత్ ప్రయంతి అభిసంవిశంతి, తత్ విజిజ్ఞాసస్వ, తత్ బ్రహ్మ “ (తైత్తిరీయోపనిషత్ –భృగువల్లి– 1) అనే వేదవాక్యం దేవుడు, మానవుడు, తిర్యక్కులు, స్థావరాలు అనే నాలుగు రీతులలో ఉండే ఈ ప్రపంచాన్ని ఎవడు సృష్టించి, రక్షించి, లయం చేసి కాపాడుతున్నాడో, ఈ జీవుడు మోక్ష ప్రాప్యం పొందేటప్పుడు ఎవరిని దరికి చేరి తున్నాడో, అతడే చాలా ఉన్నతమైనవాడు) అని తెలుపుతున్నది. శ్రీ వేదవ్యాసులు “జన్మాద్యస్య యతః” అనే సూత్రంలో ఈ అర్థాన్ని చూపి, బ్రహ్మ లక్షణాన్ని వ్యక్తం చేశారు. ఇందువల్ల, “ఈ ప్రపంచాన్ని సృష్టించి, రక్షించి, , లయం చేసి కాపాడే కారణుడు ఎవడో, అతడే ఉన్నతమైన దైవం, అతడు విష్ణువే” అనే వాస్తవాన్ని మనం తెలియవచ్చు.

కారణవస్తువును గూర్చి తెలియజేసే వాక్యాలకు కారణ వాక్యాలు అని పేరు. “ యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి, యత్ప్రయంతి అభిసంవిశంతి, తత్ బ్రహ్మ” అనే శ్రుతి వాక్యం కారణ వస్తువును గూర్చి చెబుతునందున ఇది కారణ వాక్యమే. అయితే, “ ఈ వాక్యంలో “కారణ వస్తు చాలా గొప్పది “అని మాత్రమే చెప్పబడుతున్నది తప్ప, ఏ వస్తువు శ్రియఃపతి అనే విషయం చెప్పబడలేదే! “ అనే ఒక ఆక్షేపం వస్తుంది. ఇంతే కాక, వేదాంతాలలో కారణ వాక్యాలు చాలా ఉన్నాయి. వాటిలో ఒక వాక్యం వలె ఇంకొక వాక్యం కారణ వస్తువును గూర్చి చెప్పకుండా, వైరుధ్యం తోచేటట్లుగా ఒక్కొక్క వస్తువును కారణంగా చెప్పడాన్ని మనం గమనించవచ్చు. “హిరణ్యా గర్భఃశసమవర్తతాగ్రే” (అన్ని నశించిన కాలంలో బ్రహ్మ ఒక్కడే ఉన్నాడు) , “ న సత్ నాచాసత్ శివ ఏవ కేవలః “ (సత్తు లేదు, అసత్తు లేదు. శివుడు ఒక్కడు మాత్రమే అప్పుడు ఉన్నాడు) , “ ఏకో హ వై నారాయణ ఆసీత్ న బ్రహ్మ నేశానః “ (ఆ సమయంలో నారాయణుడు ఉన్నాడు, బ్రహ్మ లేడు, శివుడు లేడు) అనే శ్రుతివాక్యాలును గమనించినట్లయితే, ఒకే వస్తువును కారణంగా చెప్పకుండా, ఒక్కొక్క వాక్యంలో వేరు వేరు వస్తువు, అంటే, ఒక వాక్యంలో బ్రహ్మ, ఇంకొక వాక్యంలో శివుడు, మరొక వాక్యంలో నారాయణుడు జగత్కారణంగా, అర్థంలో వైరుధ్యం తోచేటట్టుగా చెప్పబడడాన్ని మనం గమనించవచ్చు. ఈ మూడు వాక్యాలకు వైరుధ్యం లేని విధంగా అర్థాన్ని గ్రహించాలి. మొదటి

రెండు వాక్యాలలోనూ క్రమంగా "బ్రహ్మ ఉన్నాడు, శివుడు ఉన్నాడు" అనే విషయం స్పష్టంగా చెప్పబడినట్లుగా, "నారాయణుడు లేడు" అనేది చెప్పబడలేదు.

"ఏకో హ వై నారాయణ ఆసీత్ న బ్రహ్మో నేశానః " అనే మూడవ వాక్యంలో నారాయణుడు ఆ సమయంలో ఉన్నాడు అనే విషయం ఏ విధంగా స్పష్టంగా తెలుస్తున్నదో, ఆ విధంగానే బ్రహ్మ లేడు, శివుడు లేడు అని స్పష్టంగా తెలుస్తున్నది. ఇందువుల పైన ప్రస్తావించిన మూడు వాక్యాలలో మొదటి రెండు వాక్యాలకు క్రమంగా బ్రహ్మ మాత్రం ఉన్నాడు, నారాయణుడు లేడు. శివుడు మాత్రం ఉన్నాడు, నారాయణుడు లేడు– అనే అర్థాన్ని మనం గ్రహిస్తే, ఈ అర్థం మూడవ వాక్యంతో విరోధిస్తుంది అనేది స్పష్టం. అందుచేత, ఈ విధంగా మనం అర్థం చెప్పడానికి సాధ్యం కాదు. " ఏకో హ వై నారాయణ ఆసీత్ న బ్రహ్మో నేశానః" అనే వాక్యంలో అన్ని నశించిన కాలంలో నారాయణుడు మాత్రం ఉన్నారు బ్రహ్మ లేడు, శివుడు ఆ కాలంలో లేడు" అని స్పష్టంగా చెప్పబడినందున మిగిలిన విషయాలు అన్నీ నశించిన కాలంలో బ్రహ్మ గాని, శివుడు గానీ ఉంటే ఉండవచ్చు. బ్రహ్మ, శివుడు నశించిన కాలంలో నారాయణుడు మాత్రం ఉన్నాడు – అనే ఈ మూడు వాక్యాలను చేర్చి చూసి, మనం నిర్ణయాన్ని చేసుకోవచ్చు.

ఈ మూడు వాక్యాల వల్ల తేలిన అర్థాన్ని నిర్వహించడానికి వేరొక క్రమాన్ని కూడా మనం గ్రహించవచ్చు. అది ఏమి? అంటే, "హిరణ్యగర్భః, శివః, నారాయణః" అనే మూడు పదాలు నారాయణుని తెలుపుతున్నాయి అని మనం గ్రహించవచ్చు. ఈ విధంగా గ్రహించే పక్షంలో కూడా, " అన్నీ నశించిన కాలంలో నారాయణుడు ఒక్కడే ఉన్నాడు" అనే అర్థమే స్పష్టమవుతున్నది. అయితే, కొందరు ఇక్కడ "శివః, నారాయణః" అనే పదాలు బ్రహ్మను తెలిపే పదాలు. అయితే, పైన తెలిపిన మూడు వాక్యాలు కూడా "అన్నీ నశించిన కాలంలో బ్రహ్మ మాత్రమే ఉన్నాడు అనే అర్థాన్ని తెలియజేస్తున్నాయి" అని చెప్పవచ్చు. ఈ విధంగానే ఇంకా కొందరు, " ఇక్కడ హిరణ్య గర్భః, నారాయణః అనే పదాలు శివుని చెబుతున్నా యి. అందుచేత పైన తెలిపిన మూడు వాక్యాలు కూడా "అన్నీ నశించిన కాలంలో శివుడు మాత్రం ఉన్నాడు అనే అర్థాన్ని చెబుతున్నాయి" అని కూడా చెప్పవచ్చు. అయితే వీరిచే ఈ విధంగా చెప్పడానికి వీలు లేదు. ఎందుకు అంటే, నారాయణుడు అనే పదం ఏ విధంగానూ బ్రహ్మను కాని, శివుని కానీ చెప్పదు. "హిరణ్యగర్భః, శివః "అనే పదాలు అయితే, నారాయణుని తెలియజేస్తాయి. దీనికి ఉండే ఆధారాన్ని మనం మహాభారతంలో గమనించవచ్చు. మహాభారతంలో శివ సహస్రనామం, విష్ణు సహస్రనామం చెప్పబడి ఉన్నాయి. శివ సహస్రనామంలో నారాయణ అనే నామం నిర్దేశింపబడలేదు. అయితే,

విష్ణుసహస్రనామంలో నారాయణ నామాలుగా "హిరణ్య గర్భః, శివః" అనే నామాలు చెప్పబడ్డాయి.

అంతే కాకుండా అన్ని పదాలు నారాయణుని చెబుతున్నా యి అనే విషయాన్ని కూడా మనం తెలియవచ్చు. "ఏకో హ వై నారాయణా ఆసీత్ న బ్రహ్మా నేశానః " అనే మహోపనిషత్ వాక్యంలోని అర్థాన్నే–

"ఒన్రుమ్ తేవున్ ఉలకుమ్ ఉయిరుమ్ మ**ఱ్ఱు**మ్ యాదుమిల్లా అన్రు
నాన్ముగన్ తన్నొడు దేవరులగోడు ఉయిర్ పడైత్తాన్" (తిరువాయ్ మొ**ఴి**– 4–10–1)
(దేవతలు, ఈ లోకం, ప్రాణులు, ఇంకా ఏమీ లేని ఆ సమయంలో చతుర్ముఖునితోపాటు, దేవలోకంతో పాటు, లోకాన్ని ప్రాణులను అందరినీ సృష్టి చేశాడు) అని నమ్మాళ్వారులు,

"ఇని అఱిందేన్ ఈశఱ్కుమ్ నాన్ముగఱ్కుమ్ దెయ్ వమ్,
ఇని అఱిందేన్ ఎంబెరుమాన్ ఉన్నై– ఇని అఱిందేన్
కారణమ్ని క**ఱ్ఱ**వై నీ నఱ్కిరిశై
నారణ న్ నీ నన్గఱిందేన్ నాన్. (నాన్ముగన్ తిరువందాది– 96)
అని తిరుమ**ఴి**శై ఆళ్వార్లు అనుగ్రహించారు.

ఇక, ఇంకొక క్రమాన్ని అనుసరించికూడా కారణ వాక్యాలు నేరుగానే " నారాయణుడే జగత్కారణం" అనే వాస్తవాన్ని తెలుపుతున్నాయి– అనే విషయాన్ని కూడా తెలియవచ్చు.

1) "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్",

2) "బ్రహ్మ వా ఇదమ్ ఏకమేవ అగ్ర ఆసీత్",

3) "ఆత్మా వా ఇదమ్ ఏక ఏవ అగ్ర ఆసిత్",

4) "ఏకో హ వై నారాయణ ఆసీత్ న బ్రహ్మా నేశానః"

అనే ఈ నాలుగు వాక్యాలను గ్రహించి చూద్దాం. ఈ నాలుగు వాక్యాలు కూడా ఈ ప్రపంచం పుట్టడానికి ముందు నశించ కుండా ఉండే కారణం వస్తువును సత్, బ్రహ్మ, ఆత్మా, నారాయణః అనే పదాలతో నిర్దేశించాయి.

సామాన్య విశేషన్యాయం అనే ఒక న్యాయం ఉన్నది. దానిని గ్రహించి, "నారాయణుడే జగత్కారణం" అనే వాస్తవాన్ని ఇక్కడ మనం స్పష్టంగా తెలియవచ్చు.

ఆకాంక్ష, నిరాకాంక్షం అని రెండు పదాలను వేరువేరుగా చెబుతారు. ఆకాంక్షను కలిగినది సాకాంక్షమని, ఆకాంక్షను లేనిది నిరాకాంక్షమని తెలియ వచ్చు. ఆకాంక్ష అంటే– బుభుత్స. తత్త్వాన్ని తెలియడంలో ఉండే ఆసక్తి బుభుత్స అనబడుతుంది. . ఉదాహరణంగా, "పశుః" అనే పదం 4 కాళ్ళను కలిగిన ప్రాణిని, "ఛాగః" అనే పదం మేకను తెలుపుతుంది. "పశునా యజేత" అనే వేదవాక్యం పశువును గ్రహించి, ఒకడు ఆ యాగాన్ని చేయడానికి ప్రయత్నిస్తున్నాడు. . నాలుగు కాళ్ళను కలిగిన ప్రాణులు చాలా ఉన్నందున, ఇక్కడ "పశుః" అనే పదంతో చెప్పబడే ప్రాణి ఏది? అనే ఆకాంక్ష అతనికి కలుగుతున్నది. దానివల్ల " పశునా యజేత, "అనే వాక్యంతో ఒక విధంగా సంబంధాన్ని కలిగి ఉండే "ఛాగస్య వపాయాః" అనే వాక్యాన్ని చూస్తున్నాడు. "ఛాగః" అనే పదం నాలుగు కాళ్ళను కలిగిన మేకను చెబుతున్నందున, " పశునా యజేత "అనే వాక్యంలో ఉండే "పశుః" అనే పదం మేకను తెలుపుతుంది –అని నిశ్చయించుకొని, మేక యొక్క వపతో యాగాన్ని చేస్తున్నాడు. ఇందువల్ల సాకాంక్షమైన పదం నిరాకాంక్షమైన పదంతో ఒక విధంగా చేరి, ఆ నిరాకాంక్ష మైన పదం చెప్పే అర్థంలో పర్యవసించి, ఆకాంక్ష తీరినది అవుతున్నది– అని తెలుస్తున్నది. ఈ క్రమాన్ని సామాన్యవిశేష న్యాయం అని, ఛాగపశు న్యాయం అని అంటారు.

1) "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్" (ఈ ప్రపంచం పుట్టడానికి ముందు సత్ అనే వస్తువే ఉన్నది)

2) "బ్రహ్మ వా ఇదమ్ ఏకమేవ అగ్ర ఆసీత్, " (ఈ ప్రపంచం పుట్టడానికి ముందు బ్రహ్మం అనే ఒక వస్తువే ఉన్నది) ,

3) "ఆత్మా వా ఇదమ్ ఏక ఏవ అగ్ర ఆసీత్" (ఈ ప్రపంచం పుట్టడానికి ముందు ఆత్మా అనే వస్తువే ఉన్నది)

అనే మూడు వాక్యాలకు అర్థాన్ని గ్రహించాలి.

సత్ సత్తను కలిగినది. ఆకాశపద్మం, గొడ్రాలు కొడుకు, కుందేటి కొమ్ము మొదలైన ఏ ప్రమాణాలతోనూ తెలియడానికి సాధ్యం కానివి. అందువల్ల అవి అసత్ అనే పదం చేత చెప్పబడుతున్నాయి. అసత్ అనే పదం చేత చెప్పబడే ఈ వస్తువుల వలె కాకుండా, ఈ ప్రపంచానికి కల కారణవస్తువు ప్రమాణాల చేత తెలియబడేవాడుగా ఉన్నందున, సత్ అని చెప్పబడుతున్నాడు. బ్రహ్మం –పెద్దది, ఆత్మా –అంతటా వ్యాపించి ఉన్నది –అనే ఈ అర్థాలను చూచేవారికి ఈ మూడు వాక్యాలు జగత్కారణాన్ని గురించి

చెబుతున్నందున, కారణ వాక్యాలు అని, ఈ కారణ వాక్యాలలో ఉండే సత్, బ్రహ్మ, ఆత్మ అనే పదాలు సామాన్య శబ్దాలు కనుక, సాకాంక్ష పదాలు అని చక్కగా తెలుస్తుంది.

ఏ విధంగా, " పశునా యజేత "అనే వాక్యంలో ఉండే "పశుః" అనే శబ్దాన్ని చూచేవారికి " ఈ పదం దేనిని నిర్దేశిస్తుంది? దానిని మనం తెలిసికోవాలి–<అనే కోరిక కలుగుతున్నదో, ఆ విధంగానే, పైన తెలిపిన కారణం వాక్యాలలో ఉండే సత్, బ్రహ్మ, ఆత్మ అనే పదాలను చూసేవారికి "ఈ పదాలు ఎవరిని నిర్దేశిస్తున్నాయి? వారిని మనం తెలుసుకోవాలి" అ కోరిక కలుగుతున్నది. ఛాగ శబ్దాన్ని పురస్కరించుకొని పశుశబ్దంయొక్క అర్థాన్ని నిశ్చయించుకున్నట్లే, "ఏకో హ వై నారాయణ ఆసీత్" అనే కారణ వాక్యంలో ఉండే నారాయణ శబ్దార్థాన్ని పురస్కరించుకొని సత్, బ్రహ్మ, ఆత్మా అనే పదాల అర్థాన్ని నిశ్చయించుకోవాలి. అంటే, సత్, బ్రహ్మ, ఆత్మా అనే పదాలు "నారాయణః "అనే పదం చేత నిర్దేశింపబడే నారాయణుడు అనే విశేషార్థంలో పర్యవసానాన్ని పొంది, " ఆ నారాయణుడే కారణ వస్తువు" అని తెలుపుతున్నవి.

ఇక్కడ ఒక సందేహం.

సత్, బ్రహ్మ, ఆత్మా –అనే పదాలు "హిరణ్యగర్భః సమవర్తతాగ్రే", " న సన్నచాసచ్ఛివ ఏవ కేవలః" అనే వాక్యాలలో ఉండే "హిరణ్యగర్భః, శివః" అనే పదాల చేత చెప్పబడిన బ్రహ్మ, లేక, శివుడు అనే విశేషార్థాలలో పర్యవసానాన్ని పొంది, బ్రహ్మను కానీ, శివుని కానీ కారణ వస్తువుగా తెలుపుతున్నవి – అని మనం ఎందుకు చెప్పకూడదు? "ఏకో హ వై నారాయణ ఆసీత్" అనే వాక్యంలో ఉండే "నారాయణః" అనే పదం చేత చెప్పబడే నారాయణునిలో పర్యవసానాన్ని పొంది, ఆ నారాయణుని కారణ వస్తువుగా తెలుపుతున్నాయి– అని మాత్రమే ఎందుకు చెప్పాలి ? అనేది ఇక్కడ ఒక సందేహం.

దీనికి సమాధానం ఇది.

"ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మ నేశానః" అనే మహోపనిషత్ వాక్యం "ఈ లోకం పుట్టడానికి ముందు నారాయణుడు ఒక్కడే ఉన్నాడు. బ్రహ్మ లేడు, శివుడు లేడు" అనే అర్థాన్ని తెలుపుతున్నది. బ్రహ్మ, శివుడు లేని సమయంలో నాశం లేని నారాయణుడే కారణంగ–అనే వాస్తవాన్ని మనం గమనించినప్పుడు, సత్, బ్రహ్మ, ఆత్మా అనే పదాలు నారాయణునిలోనే పర్యవసానాన్ని పొంది, ఆ నారాయణుని కారణంగా తెలుపుతున్నాయి –అని గ్రహించడమే యుక్త మైనది. ఈ విధంగానే ఒకే వస్తువును, సృష్టించడం, రక్షించడం లయం చేయడం– అనే మూడు కార్యాలను చేయడం కోసం మూడు రూపాలను, బ్రహ్మ, విష్ణువు, శివుడు అనే మూడు నామాలను పొందినది– అని

భావించడానికి "ఏకో హ వై నారాయణ ఆసీత్ న బ్రహ్మా నేశానః" అనే వాక్యం వేదవాక్యం అవకాశాన్ని ఇస్తున్నది– అనేది కూడా ఇక్కడ స్పష్టం అవుతుంది. ఇక, "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్" అనే వాక్యం, "ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మా నేశానః" అనే వాక్యం చెప్పినట్లుగా, నారాయణుడే కారణభూతుడు– అనే తత్త్వాన్ని తెలుపుతున్నది– అనేదానిని కూడా వివరంగా గమనిద్దాం.

ఉద్దాలకుడు కొత్త గొప్ప జ్ఞాని. అతడు 12 ఏళ్ళ వయస్సును కలిగినవాడైన శ్వేతకేతువు అనే తన కుమారుని వద్ద "నీవు ఒక ఆచార్యుని దగ్గరకు వెళ్లి, వేదాన్ని అంతటినీ అధ్యయనం చేసి తిరిగి రా "అని చెప్పగా, ఆ కుమారుడు కూడా ఒక ఆచార్యుని ఆశ్రయించి, 12 ఏళ్ల పాటు వారి దగ్గర ఉండి వేదాలను అధ్యయనం చేసి మళ్లీ తన తండ్రి దగ్గరకు వచ్చి చేరాడు. తన దగ్గరకు వచ్చి చేరిన శ్వేతకేతువును ఉద్దాలకుడు చూశాడు. వేదాలను అధ్యయనం చేసి తెలుసుకున్నప్పటికీ, తన కుమారుడు వినయం లేకుండా ఉండడాన్ని గ్రహించిన ఉద్దాలకుడు, శ్వేతకేతువు బ్రహ్మజ్ఞానం కలిగినవాడై ఉంటే వినయాన్ని కూడా కలిగినవాడై ఉండేవాడు. ఇతడు వినయం లేకుండా ఉండేవాడై ఉన్నందున ఇతనికి బ్రహ్మ జ్ఞానం లేదు– అని తెలుస్తున్నది ఇతనికి బ్రహ్మ జ్ఞానాన్ని కలిగించే కలిగేటట్లు చేయాలి –అని భావించి, అతనిని చూచి, " ఉత తమాదేశం అప్రాక్ష్యః, యేన అశ్రుతం శ్రుతం భవతి, అమతం మతమ్, అవిజ్ఞాతం విజ్ఞాతమ్ ఇతి" అని ప్రశ్నించాడు.

(శ్రవణం చేయబడన ఏ వస్తువు చేత శ్రవణం చేయబడని అన్ని శ్రవణం చేయబడినట్లుగా అవుతున్నాయో, మననం చేయబడిన ఏ వస్తువు చేత మననం చేయబడని అన్ని మననం చేయబడినవిగా అవుతున్నా యో, ధ్యానం చేయబడిన ఏ వస్తువు చేత ధ్యానం చేయబడని అన్ని ధ్యానం చేయబడినవిగా అవుతున్నాయో, అన్ని వస్తువులను నియమించే ఆ వస్తువును గూర్చి నీవు నీ ఆచార్యుని దగ్గర ప్రశ్నించి విన్నావా?)

(ఆచార్యుని సన్నిధిలో విన్న వస్తువును తనకు తెలిసిన ప్రమాణాలను, యుక్తులను పురస్కరించుకొని నిశ్చయించుకోవడం మననం అనబడుతుంది. ఒక వస్తువునుగూర్చి తైల ధారవలె నిరంతరంగా చింతించే చింతన ధ్యానం అనబడుతుంది)

ఉద్ధాలకుడు బ్రహ్మజ్ఞానం అని దేనిని అభిప్రాయపడుతున్నాడు? ఘటానికి మన్ను ఉపాదాన కారణం. కుమ్మరివాడు నిమిత్త కారణం. మన్ను కుండగా పరిణమిస్తున్నందున అది ఉపాదాన కారణం అవుతుంది. మన్నును కుండగా చేయగలిగిన జ్ఞానాన్ని, శక్తిని కలిగినవాడై, మన్నును ఉండగా చేసే కుమ్మరివాడు ఆ కుండకు నిమిత్త కారణం అవుతున్నాడు. ఈ విధంగా కుండకు కుమ్మరివాడు, మన్ను వలె జగత్తుకు బ్రహ్మం నిమిత్త

కారణంగానూ, ఉపాధాన కారణంగాను ఉన్నది. బ్రహ్మను గూర్చిన ఈ వాస్తవాన్ని తెలియడమే దానిని గూర్చిన వాస్తవమైన జ్ఞానం అవుతున్నది. ఈ యథార్థమైన జ్ఞానాన్ని పొందినవాడైన తండ్రి అయిన ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువును చూచి పైన తెలిపిన విధంగా ప్రశ్నించాడు.

"యేనాశ్రుతం శ్రుతం భవతి, అమతం మతమ్, అవిజ్ఞాతం విజ్ఞాతమ్ ఇతి" ప్రశ్న లో ఉండే భాగంలో జగత్తుకు ఉపాదాన కారణం ఏది ?అనేది, "ఉత తమాదేశమ్" అనే భాగంలో జగత్తుకు నిమిత్త కారణమేది? అనేది ప్రశ్నింపబడింది.

శ్వేతకేతువునకు వీటిలో అర్థం బోధపడలేదు. "ఏ వస్తువును తెలుసుకుంటున్నామో, ఆ వస్తువే కదా తెలియబడినది అవుతుంది. ఒక వస్తువును తెలిసేటప్పుడు, మిగిలిన వస్తువులు అన్నీ ఏ విధంగా తెలియబడినవి అవుతున్నాయి? "అని మనసులో శ్వేతకేతువు సందేహాన్ని పొందాడు. . ఉద్దాలకుడు అతని మనసులోని ఈ సందేహం తీరేటట్లుగా కొన్ని ఉదాహరణలను చూపి, వివరించాడు. ఈ ఉదాహరణాలలో "యథా సౌమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్" అనే వాక్యం తెలిపే ఉదాహరణకు కూడా ఒకటి. దీని భావం ఇది. కుమ్మరివాడు కుండ మొదలైన వస్తువులను నిర్మించేటప్పుడు, మొదట మన్నును, నీటిని కలిపి, అందులో ఉండలు, రాళ్లు లేకుండా ఉండేటట్లుగా చూచి, దానిని ముద్ద చేస్తున్నాడు. తరువాత ఆ ముద్దతో కుండ, చట్టి మొదలైన వానిని నిర్మిస్తున్నాడు. ఇక్కడ, మట్టి ముద్ద ఉపాదాన కారణం. అవుతున్నది. కుండ, చట్టి మొదలైనవి కార్య వస్తువులు అవుతున్నాయి. కారణమైన మట్టి ముద్దను గూర్చి తెలిసినప్పుడు, దాని కార్యాలు అయిన ఘటం, చట్టి మొదలైనవి అన్ని తెలియబడుతున్నవి. అవుతున్నాయి కదా. ఈ విధంగానే, బ్రహ్మం ఉపాదాన కారణం, ఈ జగత్తు అనేది కార్యం. కారణం అయిన బ్రహ్మం తెలియబడేటప్పుడు, దాని కార్యం అయిన జగత్తు కూడా తెలియబడుతున్నది.

ఈ వివరణను విన్న తరువాత కూడా శ్వేతకేతువునకు మనస్సులో సందేహం తీరలేదు. కుండ పుట్టడానికి ముందు ఈ కుండ అనే కార్య వస్తువు లేదు. ముందు లేని కుండ, దానికి ముందు ఉండే మట్టి ముద్దతో పుడుతున్నది. అందుచేత మట్టి ముద్ద వేరు, కుండవేరు అని అందరికీ చక్కగా తెలు స్తుంది. ఈ విధంగా ఉపాదాన కారణం అయిన మట్టి ముద్ద, దాని కార్యం అయిన కుండ వేరు వేరు వస్తువులుగా ఉన్నందున, మట్టి ముద్దను తెలిసినప్పుడు, దాని కార్యం అయిన కుండ మొదలైన వస్తువులు అన్నీ

తెలియబడుతున్నాయి –అనేది ఏ విధంగా? – అనేది ఇంకా శ్వేతకేతువు మనస్సులో ఉండే సందేహం.

తన కుమారుని ఈ సందేహాన్ని తీర్చడం కోసం తండ్రి అయిన ఉద్దాలకుడు "వాచారంభనం వికారో నామధేయం, మృత్తికేత్యేవ సత్యమ్" (ఛాందోగ్యం –6–1–4) (వాక్కును పురస్కరించుకొని ఏర్పడే వ్యవహారం సిద్ధించడం కోసం మట్టి ముద్ద అనే కారణవస్తువే రూపంలోని మార్పును, కుండ అనే పేరులోని మార్పును పొందుతున్నది. కార్య వస్తువు అయిన కుండ నిజానికి మన్నుగానే ఉన్నది) అని అంటున్నాడు. నీటిని తీసుకొని రావడం మొదలైన ప్రయోజనాల కోసం మట్టి ముద్దయే గొంతును, కడుపును కలిగిన రూపం కల కుండ అనే పేరును పొందుతున్నది. మృణ్మయమైన ఘటం మొదలైనవి మన్నే అని ప్రమాణం చేత తెలియబడుతున్నది. (మన్ను కంటే వేరు వస్తువులుగా తెలియబడడం లేదు)

దీనిని విన్న శ్వేతకేతువు మనస్సులోని సందేహం తీరిన వాడు అయ్యాడు. ఈ విధంగా తాను అడుగక పోయినప్పటికీ, తన విషయంలో అంతు లేని కరుణను కలిగిన తన ఆచార్యుడు, తన తండ్రి ఉపదేశం చేసిన, పైన తెలిపిన అర్థాన్ని తనకు ఉపదేశం చేయనందున, తన ఆచార్యుడు ఈ అర్థాన్ని తెలియనివాడై ఉండి ఉండాలి– అని భావించిన శ్వేతకేతువు, ఆ అర్థాన్ని తనకు ఉపదేశం చేయమని ఉద్దాలకుని అర్థించాడు. ఆ సమయంలో ఉద్దాలప్పుడు శ్వేతకేతువునకు చేసిన ఉపదేశమే "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్" అనే వాక్యం.

ఇక, ఈ వాక్యానికి పూర్వపక్షి అయిన శంకరులు చెప్పే అర్థాన్ని మొదట, సిద్ధాంతంలో మనం గ్రహించే అర్థం తరువాత వివరంగా గమనిద్దాం.

"సదేవ" శ్రుత్యర్థం –పూర్వపక్షం

బ్రహ్మం అనే వస్తువు ఒక్కటే వాస్తవమైన వస్తువు. దానితో సమానమైన వస్తువు ఇంకొకటి లేదు. పోలని వస్తువు కూడా లేదు. దానికి గుణాలు లేవు. ఈ విధంగా పోలిన వస్తువు, పోలని వస్తువు, గుణాలు లేకుండా బ్రహ్మం మాత్రం యథార్థమైన వస్తువు అయి ఉన్నందున, ఆ వస్తువు నిర్విశేషం (శుద్ధం) అని చెప్పబడుతున్నది.

ఈ శ్రుతి వాక్యంలో ఉండే "సదేవ, ఏకమేవ, అద్వితీయమ్" అనే పదాలు బ్రహ్మతో పోలని వస్తువులు, పోలిన వస్తువులు, గుణాలు ఏవీ లేవు, బ్రహ్మం ఒకటే యథార్థమైన వస్తువు –అనే అర్థాన్ని తెలుపుతున్నాయి. అందుచేత మన అనుభవంలో జగత్తు

యథార్థమైన వస్తువుగానే కనిపిస్తూ ఉన్నప్పటికీ, ఆ విధంగా గ్రహించడం యుక్త మైనదిగా కనిపించడం లేదే! అనే అక్షేపం వస్తున్నది. దీనికి పరిహారం అనేది– ముత్యపు చిప్ప స్వభావాన్ని తెలియనివాడు ఒకడు ముత్యపు చిప్పకు, వెండికి మధ్య సామాన్యంగా ఉండే తెల్లదనం మొదలైన స్వభావాలను చూచి, ముత్యపు చిప్పను వెండిగా తెలిసికొంటున్నాడు. ఈ విధంగా తెలుసుకోవడానికి భ్రమ అని పేరు. ఈ విధంగా భ్రమపడిన అతడే ముత్యపు చిప్పలోని స్వభావాన్ని ప్రత్యక్షంగా సరిగా చూసినప్పుడు, తన భ్రమను వదిలిపెట్టి, "ఇది ముత్యపు చిప్ప మాత్రమే, వెండి కాదు " అని యథార్థంగా తెలిసికొంటున్నాడు. ఈ విధంగానే, బ్రహ్మంలో అవిద్య అనే దోషంచేత లోకాన్ని గూర్చిన భ్రమ ఏర్పడుతున్నది– అనే విషయాన్ని, ఆత్మ ఒక్కటే వాస్తవమైన వస్తువు, వేరు ఏదీ నిజానికి లేదు– అనే విషయాన్ని తెలిసినప్పుడు, బ్రహ్మానికి, లోకానికి మధ్య ఏర్పడిన భ్రమ తొలగిపోతున్నది– అనే విషయాన్ని మనం తెలియవచ్చు. ఈ విధంగా తండ్రి అయిన ఉద్దాలకుడు బ్రహ్మాన్ని శుద్ధం అని ఉపదేశం చేసి, తన ఆ ఉపదేశాన్ని ముగించేటప్పుడు కూడా "తత్త్వమసి" అనే వాక్యంలో ఆత్మ ఒక్కటే యథార్థమైన ఏది? అనే విషయాన్ని తెలియజేశాడు.

"సదేవ" శ్రుత్యర్థం – సిద్ధాంతం ఏ విధంగా బ్రహ్మం వాస్తవమో, ఆ విధంగానే బ్రహ్మంతో పోలిన చేతన వస్తువులు, బ్రహ్మంతో పోలని అచేతన వస్తువులు, జ్ఞానం, శక్తి మొదలైన బ్రహ్మానికి ఉండే గుణాలు యథార్థాలే బ్రహ్మం చేతనాచేతనాలతో, కల్యాణ గుణాలతో కూడినదై ఉన్నందున విశిష్టం అవుతున్నది. ఈయథార్థాన్నే "సదేవ సౌమ్య ఇద మగ్ర ఆసిత్, ఏకమేవ, అద్వితీయమ్" అనే శ్రుతి వాక్యం తెలుపుతున్నది. ఈ వాక్యంలో ఉండే "అగ్రే" అనే శబ్దానికి సృష్టికి ముందు ఉన్న కాలం– అని అర్థం. ఇదం సర్వం – ఇది అంతా, అగ్రే– సృష్టికి ముందు ఉండే కాలంలో, సదేవ ఆసీత్– సత్ చెప్పబడే వస్తువుగా ఉన్నది. ఏకమేవ ఆసీత్– ఒక్కటిగానే ఉన్నది, అద్వితీయం ఆసీత్– రెండవది లేనిదై ఉన్నది – అని అర్థం.

మన స్వామి శ్రీరామానుజులు శంకరులను చూచి "మీ మతంలో బ్రహ్మం ఉన్నది, బ్రహ్మం కంటే వేరైన అచిత్తు లేదు– అని అంటే, " –ఇదం సర్వం" ఇది అంతా, "అగ్రే ఆసీత్" –సృష్టికి ముందు ఉన్న కాలంలో సత్ అని చెప్పబడేదిగా ఉన్నది– అని ఈ వాక్యంలో వస్తున్నది. అందువల్ల సృష్టికి ముందు ఉండే కాలం అనే ఒక వస్తువు ఉన్నదా లేదా? అని అడిగారు.

కాలం అనేది ఒక తత్త్వం. ఇది అచిత్తత్వం. జ్ఞానం లేని వస్తువు ఇది. కాలతత్వం అనేది జీవునివలె ఉన్నది–< అని చెప్పడానికి లేదు. బ్రహ్మం వలె ఉన్నది అని కూడా చెప్పడానికి లేదు. సృష్టికి ముందు ఉండే కాలంలో బ్రహ్మమే ఉన్నది– అని అర్థం. అప్పుడు

కాలం అనేది ఒకటి ఉన్నది. ఆ కాలంలో బ్రహ్మం ఉన్నది– అని తెలుస్తున్నది. కాలం అనేది బ్రహ్మం కంటే వేరైన వస్తువా? లేక, బ్రహ్మంతో పోలిన వస్తువా? అని అర్థాన్ని నిర్వహించి చెప్పాలి. కాలం జ్ఞానం లేని అచిత్తత్వం. ఇది బ్రహ్మం కంటే భిన్నమైన వస్తువు. భిన్నమైన వస్తువు అయిన కాలం ఉన్నది. సత్ అనే శబ్దం చేత చెప్పబడే బ్రహ్మం కూడా ఉన్నది– అని తెలుస్తున్నది. బ్రహ్మం కంటే భిన్నమైన వస్తువు లేదు –అని మీరు చెబుతున్నారే! మరి, "అగ్రే "అనే శబ్దం దేనిని తెలుపుతుంది? అని అద్వైతులను చూచి మన స్వామి శ్రీరామానుగజులు అడిగారు. పలు గ్రంథాలను పలువురు రాస్తున్నారు అందరూ అంగీకరించేటట్టుగా ఈ ప్రశ్నకు సమాధానం చెబుతున్నారా? అని చూడాలి. శంకరులు ఏమి చెబుతున్నారు? మన స్వామి ఏమి చెబుతున్నారు? ఇందులో ఏది ప్రమాణాలకు తగినట్లుగా, మనసుకు సరిగా ఉన్నది? అనే విషయాన్ని మనం తటస్థంగా ఉండి గమనించి చూడాలి.

సృష్టికాలం, మహా ప్రళయ కాలం అంటే ఏమి? అనే విషయాన్ని మొదట గమనించి చూద్దాం. కృతయుగం, త్రేతాయుగం, ద్వాపర యుగం, కలియుగం అని నాలుగు యుగాలు. వీటిని చతుర్యుగం అంటారు. వేయి చతుర్యుగాలు కలిగినది బ్రహ్మకు ఒక పగటి కాలం. వేయి చతుర్యుగాలను కలిగినది ఒక రాత్రి కాలం. ఈ విధంగా రెండువేల చతుర్యుగాలను కలిగినది బ్రహ్మకు ఒక దినం. 360 దినాలను కలిగినది ఒక సంవత్సరం. నూరు సంవత్సరాలను కలిగినది బ్రహ్మ యొక్క ఆయుష్కాలం. ఈ విధంగా బ్రహ్మమానంతో నూరు సంవత్సరాలు కలిగిన కాలానికి పరం అని పేరు. ఈ విధంగా బ్రహ్మమానంతో నూరు సంవత్సరాలు బ్రహ్మకు ఆయుష్కాలం అని చెప్పే కాలం సృష్టి కాలం అవుతున్నది. ఈ విధంగానే, బ్రహ్మ మానంతో నూరు సంవత్సరాల కాలం మహాప్రళయ కాలం అవుతుంది. సమస్త ప్రపంచ రూపాలు నశించి, జలంలో కలిసిపోయిన ఉప్పు వలె, బ్రహ్మంలోనే ఒదిగిపోయి ఉంటాయి. అన్నీ నశించిపోయిన కాలాన్నిసృష్టికి ముందు ఉండే కాలం అని కాలతత్త్వాన్ని మనం "అగ్రే" అనే శబ్దానికి అర్థంగా ఒప్పుకుంటునట్లుగా, అన్నీ నశించిన కాలంలో, అంటే, మహాప్రళయ కాలంలో కూడా లెక్కలేనన్ని జీవాత్మలు ఉన్నాయి, వారు చేసిన కర్మలు ఉన్నాయి అనే విషయాన్ని మనం ముఖ్యంగా తెలుసుకోవాలి. ఇవి తప్పక ఉండి తీరుతాయి. అందువల్లనే మహా ప్రళయ కాలం అయినప్పటికీ, భగవంతుడు మళ్లీ సృష్టి ఆరంభించేటప్పుడు, ఈ సృష్టికి ఆరంభ కాలంలో కొందరు దేవతలుగాను, కొందరు మానవులుగానూ, కొందరు పశువులు పక్షులుగాను, కొందరు స్థావరాలుగానూ సృష్టింపబడుతున్నారు. దేవతల చరిత్రను వినేటప్పుడు, వారికి సుఖం ఉన్నది అని తెలుస్తుంది. మానవులమైన మన స్థితిని చూసేటప్పుడు, మనం సుఖదుఃఖాలను కలిపి అనుభవిస్తున్నట్లుగా తెలుస్తున్నది. పశుపక్ష్యాదులకు మనకు ఉండే

సుఖం కూడా ఉన్నట్లుగా తెలియడం లేదు. స్థావరాలకు జ్ఞాన వికాసమే బాగా ఉండదు. ఈ విధంగా సృష్టి ఆరంభ కాలంలో, భగవంతుడు సుఖాలను అనుభవించడం కోసం అనుభవించేటట్లుగా దేవతలను, సుఖదుఃఖాలను అనుభవించేటట్లుగా మానవులను, దుఃఖాన్ని అనుభవించేటట్లుగా పశుపక్ష్యాదులను, జ్ఞాన వికాసమే లేకుండా ఉండేటట్లుగా స్థావరాలను సృష్టించే ఈ విషమ సృష్టి అతనికి తగునా? అన్నిటినీ అతడు ఒకే విధంగా సృష్టించకూడదా? అనే ప్రశ్న ఇక్కడ వస్తుంది.

ఈ ప్రశ్నకు భగవంతుడు గీతలో సమాధానాన్ని చెప్పాడు. శ్రీవేదవ్యాసులు కూడా బ్రహ్మసూత్ర ప్రబంధంలో కొన్ని సూత్రాలలో పూర్వపక్ష సిద్ధాంత రూపంగా ఈ తత్త్వాన్ని గూర్చి అనుగ్రహించారు. ముఖ్యంగా, "వైషమ్య నైర్ఘృణ్యే న, సాపేక్షత్వాత్, తథాహి దర్శయతి" (2–1–34) (దేవ మానవ తిర్యక్ స్థావరాలు అనే విషమ సృష్టిని చేసే బ్రహ్మకు, ఈ విధంగా హెచ్చుతగ్గులను జీవులకు కలిగించడం వల్ల పక్షపాతం అనే దోషం, అంటే, చాలా నీచజన్మలలో జీవులకు దుఃఖం కలగడంవల్ల లేకపోవడం దయ లేకపోవడం అనే స్వభావం కలుగదు. హెచ్చుతగ్గులు ఉండే సృష్టి అనేది కర్మలను, అంటే, ఆయా జీవులు చేసిన పుణ్య పాప రూప కర్మలను ఆధారంగా చేసుకున్నది అయినందున. వేదం కూడా ఈ విషయాన్ని చూపుతున్నది కదా) అనే సూత్రం గమనించదగినది. సృష్టి ఆరంభ కాలంలో భగవంతుడు చేసిన విషమ సృష్టి అనేది వారు వారు అంతకు ముందు చేసిన పుణ్య పాప రూప కర్మలను ఆధారంగా చేసికొని చేస్తున్నందున, వారు వారు ఆయా జన్మలకు కారణం అవుతున్నారు– అని, అందువల్ల భగవంతునకు వైషమ్యయం, నైర్ఘృణ్యం (దయ లేకపోవడం) అనే ఈ దోషాలు లేవు అని ఈ సూత్రంలో సారంగా తెలుపబడింది. భగవంతుడు దీనిని గూర్చి గీతలో అనుగ్రహించిన శ్లోకం కూడా గమనించదగినది. " తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్" (4–13) (లోక సృష్టికి నేనే కారణం అవుతున్నాను. అందులో ఉండే హెచ్చుతగ్గులకు వారి వారి కర్మమే కారణం కనుక నేను దానికి కారణం కావడం లేదు– అని తెలుసుకో. అందువల్ల నేను వైషమ్యం, నైర్ఘృణ్యం అనే దోషాలు లేనివాడనుగా ఉన్నాను) అనేది గీతలో భగవంతుని సూక్తి దీనివల్ల కూడా ప్రళయ కాలంలో సైతం జీవాత్మలకు నాశనం లేదు అనే వాస్తవం బయట పడుతుంది. ఈ శ్లోకానికి మన పూర్వాచార్యులు చాలా ఆశ్చర్యకరంగా వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. ఒక తోటను చక్కగా దున్ని, అందులో మామిడి విత్తనాలను పెట్టే కాలంలో ఆ తోటలో నీటిని ప్రవహింప చేస్తే, ఆ విత్తనం మొలకెత్తుతున్నది. తరువాత మామిడి చెట్టుగా పెరిగి వృద్ధి చెందుతున్నది. ఒకవేళ వేరొక విత్తనం పెడితే, ఆ విత్తనానికి తగిన వృక్షం మొలిచి వృద్ధి చెందుతున్నది. మామిడి చెట్టు మామిడి ఫలాలను, ఇంకొక విధమైన చెట్టు ఇంకొక విధమైన ఫలాలను

ఇస్తున్నవి. మామిడి చెట్టు కాని, వేరొక చెట్టు కాని మొలిచేటప్పుడు విత్తనం తప్పక కావలసి ఉన్నది. సాధారణంగా ఒక విత్తనం మొలవడానికి భూమి, నీరు అనే వీటి సంయోగం కారణం అని శాస్త్రాలలో చెప్పబడుతున్న ది. ఇది సాధారణ కారణం అని అంటారు. భూమి, నీరు అనే వీటి సంయోగం అనేది భూమి, నీరు అనే వీటి సంబంధం. అంటే, విత్తనం భూమిలో నీటిలో చేరి ఊరడం. ఈ విధంగా ఉండే సాధారణమైన కారణం తప్ప, ఆ యా మొలకలకు ఆయా విత్తనం కారణం అనేది అసాధారణమైన కారణం అవుతున్నది. అంటే, మామిడి విత్తనం ఒక విధంగాను, ఇంకొక విత్తనం ఇంకొక విధంగా మొలవడానికి ఆయా విత్తనాలలో ఉండే ఒక సూక్ష్మమైన స్వభావం కారణం అని చెబుతున్నాము. ఇదే విధంగా, దేవ శరీరం, మానవ శరీరం అని వేరువేరుగా శరీరాలు వేరు వేరుగా కనిపించడానికి కారణం వారి చేసికొన్నటువంటి కర్మలే కారణం. భగవంతునకు జీవుల విషయంలో వైషమ్యం, లేదు, పక్షపాతం కూడా లేదు. మహాప్రళయం పూర్తి అయి, సృష్టి ఆరంభకాలంలో, కొందరిని దేవతలుగా కొందరినీ మానవులుగాను మరి కొందరిని పశువులుగా పక్షులుగాను, ఇంకా కొందరిని స్థావరాలుగాను భగవంతుడు సృష్టించడం అనేది వారు వారు చేసికొన్న కర్మలను అనుసరించే అవుతున్నది.

ఈ విధంగా, అన్నీ నశించిన ప్రళయ కాలంలో కూడా భగవంతుడు అనే తత్త్వం నశించకుండా ఉన్నట్లే, జీవాత్మలకు కూడా నాశం అనేది లేదు, వారి కర్మలకు కూడా నాశం లేదు. అందువల్లనే మహాప్రళయం పూర్తి అయ, సృష్టియొక్క ఆరంభ కాలంలో వారి కర్మలకు అనుగుణంగా భగవంతుడు సృష్టిని చేస్తున్నాడు. ఇది శాస్త్రాలలో స్పష్టంగా చెప్పబడి ఉండే తత్వం. దీనిని అందరూ తప్పక ఒప్పుకోవాలి. దీనిని ఒప్పుకోకుండా పోతే, సృష్టి కాలంలో శరీరాలు వేరువేరుగాను, సుఖదుఃఖాలు వేరువేరుగాను జీవులలో కనిపించడాన్ని నిర్వహించడానికి సాధ్యం కాదు. జీవాత్మలు ఎల్లప్పుడూ ఉన్నారు –అనేదానికి "నిత్యో నిత్యానాం చేతనః చేతనానామ్, ఏకో బహూనామ్ యో విదధాతి కామాన్" (శ్వేతా శ్వేతరోపనిషత్తు) (6–13–) (నిత్యులయిన జీవాత్మలకు నిత్యుడైన ఏ పరమచేతనుడు వారి కోరికలను అనుగ్రహిస్తున్నాడో) అనే వేదవాక్యం ప్రమాణం అవుతున్నది. మహాప్రళయ కాలఃలో సూక్ష్మంగా ప్రకృతి తత్త్వం ఉన్నది అనేదానికి ప్రమాణం ఉన్నది.

జీవాత్మ జ్ఞానాన్ని కలిగినవాడు. ఈ జ్ఞానం ధర్మభూత జ్ఞానం అనబడుతుంది. సృష్టి కాలంలో, జీవాత్మ ఒక శరీరంతో కూడి ఉండే కాలంలో, ఈ ధర్మభూత జ్ఞానానికి కొంచెం వికాసం ఏర్పడుతున్నది. ప్రళయకాలలో, జీవాత్మ శరీరం, శరీరంలో ఉండే కళ్ళు మొదలైన బాహ్యేంద్రియాలు, మనస్సు అనే అంతరింద్రియం నశించిపోతాయి. అందువల్ల

శరీర సంబంధం చేత, ఇంద్రియాల సంబంధంచేత ధర్మభూత జ్ఞానానికి ఏర్పడే వికాసం జీవాత్మకు ప్రళయకాలంలో ఉండదు. . ఈ సమయంలో జీవాత్మకు ఉండే జ్ఞానం, అంటే, ధర్మభూత జ్ఞానం ఉంటుంది, అయితే, ఈ ధర్మభూతజ్ఞానం కొంచెం కూడా వికాసం లేకుండా ఉన్నది అనేటట్లుగా ఉంటుంది.

వికసించిన జ్ఞానంతో కూడిన జీవాత్మలు ప్రళయ కాలంలో లేవు అనే కారణాన్ని పురస్కరించుకుని" జీవాత్మలు ఈ కాలంలో లేవు"అని ఒక విధంగా చెప్పవచ్చునే తప్ప, నిజానికి జీవాత్మలు, వారి కర్మలు లేవు అని పూర్తిగా మనం చెప్పడానికి సాధ్యం కాదు. చేతనాచేతన విశిష్టం పరమాత్మ. ప్రళయకాలంతో, సృష్టి కాలంతో ఏ విధమైన తేడా లేకుండా బ్రహ్మం ఎల్లప్పుడూ చేతనా చేతనాలతో కూడి ఉంటుంది– అనే యథార్థం శాస్త్రాలలో స్పష్టంగా చెప్పబడినది.

సోంతే వైశ్వానరో భూత్వా సంతక్తే సర్వాణి భూతాని, పృథివీ అప్సు ప్రలీయతే, ఆపః తేజసి లీయతే, తేజో వాయౌ లీయతే వాయు రాకాశే లీయతే, ఆకాశః ఇంద్రియేషు, ఇంద్రియాణి తన్మాత్రేషు, తన్మాత్రాణి భూతాథౌ లీయతే, భూతాని మహతి లీయతే, మహాన్ అవ్యక్తే లీయతే, అవ్యక్తం అక్షరే లీయతే, అక్షరం తమసి లీయతే, తమః పరే దేవ ఏకీభవతి"

"సోంతే వైశ్వానరో భూత్వా సంతక్తే సర్వాణి భూతాని" అనే వాక్యం "పరమ పురుషుడు ఈ ప్రపంచం లయించేటప్పుడు కాలాగ్నిరూపుడై దేవతలు, మానవులు, పశువులు, పక్షులు స్థావరాలు మొదలైన అన్ని ప్రాణులను దహిస్తున్నాడు" అనే అర్థాన్ని తెలుపుతున్నది.

ఒక వస్తువు తనకు ఉండే స్థితిని కోల్పోయి, కారణ వస్తువుతో కలిసి ఉండే స్థితి లయం అనబడుతుంది. కారణ వస్తువునే ఉపాదానం, అపాదానం అని రెండు విధాలుగా వేరువేరుగా నిర్దేశిస్తున్నారు. మన్నును, కుండను ఉదాహరణంగా గ్రహిస్తే, మన్నులో ఏ భాగం కుండగా అవుతున్నదో, ఆ భాగం ఉపాదానం అని, మన్నులో ఏ భాగం కుండగా మారడం లేదో, ఆ భాగం అపాదానం అని చెప్పబడుతున్నాయి. కుండ అనే వస్తువు తనకు కల స్థితిని కోల్పోయి, మన్నుగా ఉండే స్థితిని పొంది, కుండగా మారడాన్ని పొందకుండా, మట్టితో మట్టిగా కలిసి ఉండే స్థితిని ఉద్దేశించి "ఆ కుండ లయాన్ని పొందుతున్నది" అని అంటున్నాము. అందుచేత కార్యం, అంటే, కుండ ఉపాదాన కారణం అనే స్థితిని, (అంటే, ఏ మన్ను కుండగా మారిందో, ఆ మన్ను యొక్క స్థితిని) పొంది, అపాదానంతో (అంటే, ఏ

మన్ను కుండగా మార్పును పొందలేదో, ఆ మన్నుతో) ఒకటిగా కలసి ఉండే స్థితి లయం అనబడుతున్నది.

ఈ విధంగా చూసినప్పుడు, మన్ను అనే వస్తువు తన స్థితిని కోల్పోయి, నీరు అనే స్థితిని పొంది, అంతకు ముందు ఉండే నీరుతో నీరుగా కలసి ఉండే స్థితిని "పృథివీ ఆప్సు ప్రలీయతే "అనే ప్రయోగం తెలుపుతున్నది. ఈ విధంగానే, నీరు అగ్నిలోనూ, అగ్ని వాయువులోనూ, వాయువు ఆకాశంలోనూ లయాన్ని పొందడాన్ని "ఆపః తేజసి లీయతే, తేజో వాయౌ లీయతే వాయు రాకాశే లీయతే" అని తెలుపబడింది.

ఆకాశం ఇంద్రియాలలోను, ఇంద్రియాలు తన్మాత్రలలోనూ పైన తెలిపిన విధంగా లయాన్ని పొందకుండా, సంబంధాన్ని మాత్రం పొందుతున్నాయి. ఈ వాస్తవాన్ని "ఆకాశః ఇంద్రియేషు, ఇంద్రియాణి తన్మాత్రేషు" అనే భాగం తెలుపుతున్నది. దీనివల్ల ఆకాశానికి ఇంద్రియాలు, ఇంద్రియాలకు తన్మాత్రలు ఉపాదాన కారణాలు కాదు— అనే విషయాన్ని కూడా మనం తెలియవచ్చు.

తన్మాత్రలు అహంకారంలోను, అహంకారం మహత్తత్వంలోనూ, మహాతత్వం అవ్యక్తంలోను, అవ్యక్తం అక్షరంలోను, అక్షరం తమస్సులోనూ లయాన్ని పొందుతున్నాయి —అనే విషయాన్ని "తన్మాత్రాణి భూతాథౌ లీయతే, భూతాని మహతి లీయతే, మహాన్ అవ్యక్తే లీయతే, అవ్యక్తం అక్షరే లీయతే, అక్షరం తమసి లీయతే " అనే భాగం తెలుపుతున్నది.

సత్వం, రజస్సు, తమస్సు అనే గుణాలు హెచ్చుతగ్గులు లేకుండా సమంగా ఉండే స్థితి అవ్యక్తం అనబడుతుంది. . జీవసమూహాన్ని తనలో గ్రహించేది, చాలా సూక్ష్మమైనది గుణసామ్యాన్ని కలిగినది అయిన స్థితి అక్షరం అని అనబడుతున్నది. నీటిలో కలిసిన ఉప్పు వంటిది, సూర్యకాంత మణిలో ఉండే ఔష్ణ్యం (వేడిమి) వంటిది, పరమ పురుషుడు ఒక్కనికే మాత్రం తెలియదానికి సాధ్యమై, చాలా సూక్ష్మమై ఉండేది అయిన స్థితి తమస్సు అనబడుతున్నది. అవ్యక్తం, అక్షరం, తమస్సు అనే పదాలు కారణ స్థితిలో ఉండే వస్తువును నిర్దేశిస్తున్నాయి. మహాన్, అహంకారం, తన్మాత్రలు అనే పదాలు కార్య స్థితిలో ఉండే వస్తువులను నిర్దేశిస్తున్నాయి.

సత్వం, రజస్సు, తమస్సు అనే వీటిలో ఉండే హెచ్చుతగ్గులను వైషమ్యం అని అంటారు. ఈ విధంగా వైషమ్య స్థితిలో ఉండే వస్తువే కార్య వస్తువు అనబడుతుంది. కార్య వస్తువులలో మొట్టమొదట ఉండే కార్య వస్తువును మహాన్ అని అంటారు. దాని నుండి

పుట్టిన కార్య వస్తువును అహంకారం అంటారు. ఇది, సాత్త్వికం, రాజసం తామసం అని మూడు విధాలుగా ఉంటుంది. ఈ మూడు విధాలుగా ఉండే అహంకారాలలో, సాత్త్వికాహంకారంలోనుండి ఇంద్రియాలు పుడుతున్నాయి– అనేది, తామసాహంకారం నుండి పంచేంద్రియాలు, సూక్ష్మ వస్తువులైన తన్మాత్రలు పుడుతున్నాయి– అనేది మనం తెలియవచ్చు.

"తమః పరే దేవ ఏకీభవతి" అనే వాక్యం పైన తెలిపిన తమస్సు అని చెప్పబడే చాలా చాలా సూక్ష్మమైన ప్రపంచం పరమ పురుషునిలో ఏకీభవాన్ని పొందుతున్నది– అనే అర్థాన్ని తెలుపుతున్నది. ఈ వాక్యంలో లయాన్ని సూచించే పదాన్ని కాక, ఏకీభావాన్ని నిర్దేశించే పదాన్ని మాత్రం గమనిస్తున్నాము. . పంచభూతాలలో ఒకటి ఇంకొక దానిలో లయాన్ని పొందడంవలె, తమస్సు అనే తత్త్వం పరమ పురుషునిలో లయం పొందుతున్నది– అని అంటే, పరమ పురుషునకు అచిత్తు యొక్క స్వభావం కానీ, సూక్ష్మ ప్రపంచానికి పరమపరుషుని స్వభావం కానీ చెప్పడం సంభవిస్తుంది కనుక, ఉపనిషత్తు అనేది ఈ చోట "లయః "అనే శబ్దాన్ని ప్రయోగించి పలుకకుండా, "ఏకీభవతి " (సంబంధాన్ని పొందుతున్నది) అనే పదాన్ని ప్రయోగించి పలికింది.

ఈ విధంగా ప్రళయాన్ని వర్ణించే శ్రుతివాక్యాన్ని, ఆ వాక్యంతో తెలియజేయబడే అర్థాన్ని మనం లోతుగా గమనించి చూసినప్పుడు, ప్రళయ కాలంలోకూడా చేతనా చేతనాత్మకమైన జగత్తు అనేది చాలా చాలా సూక్ష్మమైన వస్తువై, భగవంతునిలో ఒకటిగా చేరి ఉంటుంది అనే స్థితి తెలియబడుతున్నది– అనేది స్పష్టం.

"సృష్టి కాలంలో చేతనా చేతనాత్మకమైన ఈ జగత్తు అనేది ఉన్నది అనే విషయాన్ని మనం ప్రత్యక్షం వల్ల కూడా తెలుసుకుంటున్నాము. శాస్త్రం కూడా ఈ వాస్తవాన్ని మనకు తెలుపుతున్నది.

"తస్మాత్ తమ స్సంజాయతే, తమసో భూతాదిః, భూతాదే రాకాశః, ఆకాశాత్ వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, తదండమ్ సమభవత్" (పరమ పురుషునినుండి ప్రళయ కాలంలో, అతనిలో ఒకటి అని చెప్పేటట్లుగా కలసి ఉండే తమః అనే తత్త్వం అనేది కార్యంగా మారే స్థితిని పొందుతున్నది. ఆ తమస్సులో నుండి క్రమంగా ఆకాశం, వాయువు, అగ్ని, నీరు, భూమిన అనే వస్తువులు పుడుతున్నాయి. భూమి వరకు ఉండే తత్త్వాల పరిణామమే అండం) అనే సుబాలోపనిషద్వాక్యం (ప్రథమ ఖండం) గమనించదగినది.

ఇంతవరకు చెప్పినదానిని బట్టి, అన్నీ నశించిన కాలంలోను, అంటే, ప్రళయ కాలంలోను, ఈ కాలంలోను, అంటే, సృష్టి కాలంలోనూ, చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు అనే మూడు తత్త్వాలు ఉన్నాయి– అనేది స్థాపింపబడినది అయినది. ఇక, ప్రళయకాలంతో పాటు, సృష్టి కాలంతో పాటు ఏ విధమైన తేడా లేకుండా, ఈ మూడు తత్త్వాలలో, చిత్తు, అచిత్తు, అంటే, జీవాత్మలు, అచేతన వస్తువులు అనేవభగవంతునకు శరీరంగా ఉంటాయి– అనే యథార్థాన్ని మనం గమనించవచ్చు.

"యస్య అక్షరం శరీరమ్, యేనాక్షరమ్ అంతరే సంచరన్, యమ్ అక్షరం న వేద, యస్య మృత్యుః శరీరమ్, యో మృత్యుమ్ అంతరే సంచరన్, యం మృత్యుః న వేద, స ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః" (ఎవనికి అక్షరం శరీరమో, ఎవడు అక్షరం లోపల సంచరిస్తున్నాడో, ఎవనిని అక్షరం తెలియలేదో, ఎవనికి మృత్యువు (ఇక్కడ మృత్యు శబ్దానికి తమస్సు అని అర్థం) శరీరమౌ, ఎవడు మృత్యువు లోపల సంచరిస్తున్నాడో, ఎవనిని మృత్యువు తెలియలేదో, అటువంటి అతడు అన్ని భూతాలకు అంతరాత్మయై, పాపం లేనివాడై, తన ఇచ్ఛతోనే ఈ శరీరాలను పరిగ్రహిస్తున్నందున దివ్యుడై ఉండే నారాయణుడు) అనే సుబాలోపనిషత్ (ఏడవ ఖండంలోని) వాక్యాన్ని, " యస్య పృథివీ శరీరం, యం పృథివీ న వేద, యస్య ఆత్మా శరీరం, యం ఆత్మా న వేద " (ఎవరికి భూమి శరీరమో, ఎవనిని భూమి తెలియలేదో, ఎవరికి ఆత్మ శరీరమో, ఎవనిని ఆత్మ తెలియదో) అనే బృహదారణ్యకోపనిషద్వాక్యాన్ని చూచేవారికి –జీవాత్మలు, అచేతన వస్తువులు భగవంతుని శరీరాలు –అనే తత్త్వం చక్కగా వ్యక్తం అవుతుంది. మృత్యుః, తమః అనే ఈ రెండు పదాలు చాలా చాలా సూక్ష్మమై ఉండే ప్రపంచాన్ని తెలుపుతాయి. అందుచేత ప్రళయ కాలంలో కూడా సూక్ష్మమైన చేతన వస్తువులను, అచేతన వస్తువులను శరీరంగా బ్రహ్మం కలిగి ఉన్నది– అనే విషయం చక్కగా ప్రకాశిస్తుంది.

ప్రళయ కాలంలో ప్రపంచం, బ్రహ్మం వేరు వేరు తత్త్వాలుగా ఉన్నప్పటికీ, ఒక విధంగా "ఒకటి" అని చెప్పేటట్లుగా ఏకమై ఉన్నందున, సూక్ష్మ స్థితిలో ఉండే ప్రపంచంతో కూడిన బ్రహ్మాన్ని "సదేవ సౌమ్యేథ మగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయమ్" అనే వాక్యంలో ఉండే "ఏకమ్"అనే పదం నిర్దేశిస్తున్నది. . నామరూపాలతో కూడి ఉంది స్థితి స్థూల దశ అని అనబడుతుంది. పేరును, రూపాన్ని కోల్పోయిన దశ సూక్ష్మదశ అని అనబడుతుంది.

తండ్రి అయిన ఉద్దాలకుడు "ఒకటిని తెలిస్తే, అన్నిటినీ తెలిసినట్లు అవుతుంది" అనే యథార్థాన్ని తన కుమారుడైన శ్వేతకేతువును ఉద్దేశించి చెప్పేటప్పుడు " ఏకేన

మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్" అని అన్నాడు. ఈ వాక్యంలో మన్ను అనే కారణ వస్తువు కుండ, చట్టి, బాన మొదలైన పేర్లను, రూపాలను పొంది కార్యవస్తువై ఉండేటప్పుడు అనేకంగా ఉన్నందున "సర్వం" అని. కుండ, చట్టి బానవంటి రూపాలను పొందకుండా, కారణ వస్తువుగా ఉండేటప్పుడు ఒక్కటిగా ఉన్నందున "ఏకేన మృత్పిండేన" అని నిర్దేశింపబడినది. ఈ వాక్యంలో సూక్ష్మ దశను, (నామరూపాలను పొందకుండా ఉండే దశను) ఏకశబ్దం, స్థూల దశను (నామరూపాలను పొంది ఉండే దశను) సర్వశబ్దం తెలుపుతున్నాయి అనేది స్పష్టం. ఈ విధంగానే, "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్" అనే కారణాన్ని చెప్పే వాక్యంలో ఉండే ఏకశబ్దం కూడా సూక్ష్మ దశలో ఉండే ప్రపంచంతో కూడిన బ్రహ్మాన్ని తెలుపుతున్నది– అనే విషయాన్ని మనం తెలియవచ్చు. బ్రహ్మం కార్యదశలో "పలు పదార్థాలుగా నేను అవుతాను" అనే సంకల్పాన్ని చేసి, పలు వస్తువులుగా, అంటే, పలు వస్తువులను శరీరంగా కలిగిన బ్రహ్మగా అయినది–< అనే యథార్థాన్ని తెలుపకోరిన శ్రుతి "బహు స్యామ్ "అని, " బహు" అనే పదాలను ఉపయోగించి చెప్పడాన్ని మనం గమనించవచ్చు.

## గుణవిశిష్టం బ్రహ్మ

బ్రహ్మం అనేది ప్రత్యక్షంతోనూ, అనుమానంతోనూ తెలియడానికి సాధ్యంకానిది, శాస్త్రాన్ని పురస్కరించుకుని మాత్రమే తెలియడానికి సాధ్యమైనది అయిన ఉన్నతమైన తత్వం– అనే విషయాన్ని వేదవ్యాసులు బ్రహ్మసూత్ర ప్రబంధంలో స్పష్టం చేశారు. బ్రహ్మాన్ని గూర్చి తెలియజేసే వేదం అనేది ఆ బ్రహ్మకు జ్ఞానం, శక్తి మొదలైన లెక్కలేనన్ని కళ్యాణ గుణాలు ఉన్నాయి అని, ఆ గుణాలు సత్యాలు అనే యథార్థవిషయాన్ని మనకు తెలుపుతున్నాయి. యథార్థమైన స్థితి ఈ విధంగా ఉండగా, "నిర్గుణమ్, అద్వితీయమ్" అని శాస్త్రం చెప్పడంలోని తాత్పర్యాన్ని తెలియని అద్వైతులు వీటిని ప్రమాణంగా చూపించి, బ్రహ్మానికి గుణాలు లేవు అని చెబుతున్నారు అద్వైతుల ఈ వాదం వైదిక సిద్ధాంతానికి విరుద్ధమైనది –అనే విషయాన్ని, ఈ శ్రుతి వాక్యాలకు ఏ విధంగా అర్థాన్ని గ్రహించాలి అనే విషయాన్ని గూర్చి సంగ్రహంగా విజ్ఞాపన చేస్తాను.

వేదాంతవాక్యాలకు న్యాయాపేక్ష ఉన్నది. అంటే, తగిన న్యాయాల సహాయంతోనే వేదాంతవాక్యాలకు ఉండే అర్థాలను నిర్ణయించాలి– అనేది వైదికుల అభిప్రా యం. దీనిని అనుసరించి, మొదట ఒక న్యాయాన్ని గూర్చి విజ్ఞాపన చేస్తాను.

శాస్త్రాలలో ఒకచోట "న హింస్యాత్ సర్వా భూతాని " (ఏ జంతువును హింసించకూడదు) అని, " అగ్నీషోమీయం పశు మాలభేత " (యాగంలో పశువును

వధించి, దాని వపను అంటే, ఒక విధమైన మాంసాన్ని దేవతలకు సమర్పించాలి) అనే విధి కనపడుతున్నది. ఈ విధంగా ఒక రీతిలో ఉండే విధి వాక్యాల మధ్యలో వైరుధ్యం ఉన్నట్లుగా మనకు తోస్తున్నది. ఈ రెండు వాక్యాలు ప్రమాణంగా పరిగ్రహించదగినవే కనుక, ఈ వైరుధ్యాన్ని పరిహరించవలసిన కర్తవ్యం వైదికులకు ఉన్నది. ఏ హింసను శాస్త్రం చేయమని ఆజ్ఞాపించినదో, ఆ హింసను "న హింస్యాత్" అని శాస్త్రమే నిషేధించదు. శశాస్త్రాలలో విధింపబడిన హింసలను తప్ప, మిగిలిన హింసలను చేయకూడదు– అనేదే ", న హింస్యాత్ సర్వా భూతాని "అనే శాస్త్ర వచనానికి కల అర్థం. ఈ విధంగా గ్రహిస్తే, ఈ రెండు వచనాల మధ్య వైరుధ్యం లేదు. ఇది ఒక రీతిలో చెప్పబడే పరిహారం. యాగంలో పశువును వధించేవానికి, వధింపబడే పశువుకు శ్రేయస్సు కలుగుతుంది– అని చెప్పి నందున, పశువును వధించడం హింసయే కాదు. ఇందువల్ల ఈ రెండు విధి వాక్యాలకు పరస్పరం వైరుధ్యం లేదు" అనేది స్పష్టపడుతున్నది. ఇది ఇంకొక రీతిలో ఉండే పరిహారం. ఈ విషయాలను మనస్సులో పెట్టుకొని, ఇంకా కొన్ని వేదాంతవాక్యాల అర్థాలను మనం నిర్ణయించాలి.

"యః సర్వజ్ఞః సర్వవిత్" (ముండకోపనిషత్–1–1 – 10) (ఏ పరమాత్మ అన్ని వస్తువుల స్వరూప స్వభావాలను తెలుసుకుంటున్నాడో) , "పరా ఽ స్య శక్తిః వివిధైవ శ్రూయతే, , స్వాభావికీ జ్ఞానబలక్రియా చ" ( శ్వేతాశ్వతరోపనిషత్–6–6–8) (ఈ పరమాత్మకు పలు విధాలుగా ఉండే చాలా గొప్పవైన శక్తి, సహజమైన జ్ఞానం, బలం ఉన్నాయి అని తెలియబడుతున్నది) అనే ఇటువంటి వేదాంతవాక్యాలు భగవంతునికు జ్ఞానం, శక్తి మొదలైన కళ్యాణ గుణాలు ఉన్నాయి అనే విషయాన్ని తెలుపుతున్నాయి. "నిర్గుణమ్ " అనే కొన్ని శ్రుతివాక్యాలు భగవంతునకు గుణాలు లేవు–అనే అర్థాన్ని తెలుపుతున్నాయి. " నిషేధస్య విహితవ్యతిరేకవిషయత్వాత్" అని శాస్త్రజ్ఞులు చెప్పే రీతిని దృష్టిలో పెట్టుకుని చూస్తే, జ్ఞానం, శక్తి మొదలైన ఏ గుణాలు బ్రహ్మకు ఉన్నాయి అని వేదవాక్యాలు చెబుతున్నాయో, ఆ గుణాలనే "నిర్గుణమ్" అనే శ్రుతి చెప్పకుండా, వీటికంటే వేరైన మిగిలిన గుణాలనే "లేవు "అని చెబుతున్నది– అని గ్రహించడం ఒక విధమైన పరిహారం అవుతున్నది.

"యః సర్వజ్ఞః సర్వవిత్ ", " పరా ఽ స్య శక్తిః వివిధైవ శ్రూయతే, , స్వాభావికీ జ్ఞానబలక్రియా చ" అనే ఇటువంటి వేదవాక్యాలు బ్రహ్మానికి కళ్యాణ గుణాలు ఉన్నాయి అనే యథార్థాన్ని, " నిర్గుణమ్" అనే శ్రుతి – బ్రహ్మానికి హేయగుణాలు ఏమీ లేవు –అనే యథార్థాన్ని తెలుపుతున్నాయి. అందుచేత ఈ వేద వాక్యాలు పరస్పరం అర్థంలో వైరుధ్యాన్ని కలిగినది కావు– అనే సంగతి స్పష్టమవుతున్నది. ఇది ఇంకొక రీతిలో ఏర్పడిన పరిహారం.

ఈ లోకానుభావాన్ని అనుసరించి మనం ఒక విషయాన్ని గమనించాలి. కుండను కుమ్మరివాడు చేస్తున్నాడు. కుండను చేయడానికి కావలసిన జ్ఞానం, శక్తి అతనికి ఉన్నందున వల్లనే అతడు ఆ కుండను చేయడం సాధ్యం అవుతున్నది. వస్త్రాన్ని నేయడానికి తగిన జ్ఞానం, శక్తి ఒకనికి ఉంటే, అతడు వస్త్రాన్ని నేస్తున్నాడు. ఒకరివల్ల ఒక కార్యం పుడుతున్నప్పుడు, ఆ కార్యాన్ని చేయడానికి కావలసిన జ్ఞానం, శక్తి అతని దగ్గర ఉండడాన్ని మనం చూస్తున్నాము. ఈ విధంగానే, ఈ ప్రపంచాన్ని సృష్టించడం అనే ఒక మహా కార్యాన్ని భగవంతుడు నిర్వహిస్తున్నాడు. ఈ ప్రపంచాన్ని సృష్టించడానికి ఆవశ్యకం అయిన జ్ఞాన, శక్తులు అతని దగ్గర ఉన్నాయి– అనే విషయాన్ని మనం అంగీకరించాలి. "పరాస్య శక్తిః ని వివిధైవ శ్రూయతే" అనే శ్రుతివాక్యం భగవంతునకు జ్ఞానం, బలం ఉన్నవి. నియమించే శక్తి ఉన్నది అని, ఆ స్వామి యొక్క కళ్యాణ గుణాలను పల్కి, అవి అతనికి సహజమైనవి అని చెబుతున్నది.

"యః సర్వజ్ఞః సర్వవిత్ ", " పరా ఽ స్య శక్తిః వివిధైవ శ్రూయతే, , స్వాభావికీ జ్ఞానబలక్రియా చ" అనే వేదవాక్యాలకు అద్వైతులు ఇంకొక విధంగా అర్థాన్ని చెబుతున్నారు. వాసన అనేది నీటికి సహజమైనది కాదు. నీటిలో పువ్వు సంబంధంచేతనే వాసన కలుగుతున్నది– అనే విషయాన్ని మనం తెలిసికొంటున్నాము. ఈ విధంగానే, బ్రహ్మానికి గుణం సహజ సిద్ధమైనది కాదు. బ్రహ్మం శుద్ధమైనది. అవిద్య అనే దోషం వల్ల బ్రహ్మానికి గుణాలు కలుగుతున్నాయి. అందుచేత, అవిద్య యొక్క సంబంధం చేత బ్రహ్మానికి ఏర్పడుతున్న గుణాలనే ఈ వేదవాక్యాలు తెలుపుతున్నాయి. బ్రహ్మానికి గుణాలు లేవు –అనే యథార్థన్ని "నిర్గుణమ్"అనే వేదవాక్యం తెలుపుతున్నది–అనేది అద్వైతుల వాదం. ఈ వాదం యుక్తమైనది కాదు– అనే విషయన్ని గూర్చి మొదట గమనిద్దాం.

ఇతరులను "నీవు ఈ విధంగా చేయాలి "అని నియమించడం ఒకనికి గొప్పతనం కలిగిస్తుంది. "నాలుక కదిలితేనే నాడు కదులుతుంది" అనే విధంగా ఒకని ఆజ్ఞనుబట్టి దేశం మొత్తం నడిస్తే, అది అతనికి చాలా గొప్పతనం కలిగిస్తుంది. పరమ పురుషునకు అందరినీ నియమించడం– అనే గొప్పతనాన్ని శాస్త్రం తెలుపుతున్నది. ఒక చక్రవర్తి తన రాజ్యంలో ఉండేవారిని ఇంద్రుడు ముల్లోకాలలో ఉండే వారిని, బ్రహ్మ 14 లోకాలలో ఉండేవారిని నియమిస్తున్నారు– అనే విషయాన్ని మనం పురాణాల ద్వారా తెలుసుకుంటున్నాం. పరమ పురుషుడు అందరిని నియమనం చేస్తున్నాడు– అనే విషయాన్ని కూడా తెలిసికొంటున్నాం. చక్రవర్తి మొదలు బ్రహ్మ వరకు ఉండే అధికారులు చేసే నియమనాలను, ఆజ్ఞలను లోకంలో ఉండేవారు అనుసరించి ప్రవర్తించడం కర్మ మూలకంగా జరుగుతుంది. అయితే భగవంతుని నియమనాన్ని అనుసరించి లోకం ప్రవర్తించడం అనేది ఈ విధంగా ఒక హేతువు వల్ల కాదు.

ఏ విధమైన హేతువు వల్ల కాకుండా, అందరిని సహజంగానే నియమించి నడిచేటట్టు చేయడం అనే గొప్పతనం పరమ పురుషునకు తప్ప మరి ఎవరికి లేదు– అనే విషయాన్ని నాన్యో హేతుః విద్యతే ఈశనాయ" అనే వేదవాక్యం స్పష్టంగా తెలుపుతున్నది. అంతేకాక, " పరా ఽ స్య శక్తిః వివిధైవ శ్రూయతే, , స్వాభావికీ జ్ఞానబలక్రియా చ" అనే వేదవాక్యంకూడా, పువ్వుకు సువాసన వలె, పరమ పురుషునకు జ్ఞానం మొదలైన గుణాలు సహజంగానే ఉన్నాయి– అనే విషయాన్ని తెలుపుతున్నది. దీనిని అనుసరించి గమనించి చూచినట్లయితే, పువ్వుకు సువాసన వలె భగవంతునకు జ్ఞానం మొదలైన గుణాలు ఉన్నాయి, అవి, నీటికి సువాసన వలె, ఔపాధికాలు కావు– అనే విషయం స్పష్టమవుతున్నది.

## అద్వితీయం బ్రహ్మ

ఈ విధంగా, "నిర్గుణమ్" అనే వేదవాక్యం అద్వైతులు చెప్పినట్లుగా బ్రహ్మానికి గుణాలు లేవు– అనే విషయాన్ని తెలుపదు అనే సంగతిని తెలుసుకొన్నాము. " అద్వితీయమ్" అనే శ్రుతి బ్రహ్మాన్ని గూర్చి తెలియజేసే యథార్థం అనేది ఏమి? అనే సంగతిని గూర్చి ఇక చూద్దాం.

"సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్" అనే శ్రుతిలో ఉండే "ఏకమ్" అనే పదం నామరూపాలను కోల్పోయి సూక్ష్మదశలో ఉండే చేతనాచేతనాలను శరీరంగా కలిగి ఉండే బ్రహ్మాన్ని తెలుపుతున్నది– అనే విషయాన్ని, ఆ బ్రహ్మం "బహు స్యామ్" (నేను అనేక వస్తువులును శరీరంగా కలిగిన బ్రహ్మంగా అవుతాను) అని సంకల్పించి, ఆ విధంగా అవుతున్నది –అనే విషయాన్ని ఇంతకు ముందు చూశాము. వీటిని మనస్సులో పెట్టుకుని చూసినప్పుడు, మట్టి ముద్దవలె సూక్ష్మ దశలో ఉండే చేతనాచేతనాలను శరీరంగా కలిగి ఉండే బ్రహ్మం ఉపాదానకారణం అని, కుండ, చట్టి, బాన వంటి స్థూలదశలో ఉండే చేతనాచేతనాలను శరీరంగా కలిగి ఉండే బ్రహ్మం దాని కార్యం అని స్పష్టమవుతున్నది.

ఇందువల్ల, "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్" అనే వేదవాక్యంలో ఉండే "ఏకమ్" అనే పదం ఈ ప్రపంచానికి ఉపాదాన కారణం అయిన బ్రహ్మాన్ని చెబుతున్నది –అనేది తెలుస్తున్నది. జగత్తుకు ఉపాదాన కారణం బ్రహ్మం అంటే, ఆ జగత్తుకు నిమిత్త కారణం అనేది ఏది? అనే ప్రశ్న వస్తుంది. "అద్వితీయమ్" అనే శ్రుతి –"జగత్తుకు ఉపాదాన కారణం అయిన బ్రహ్మమే నిమిత్త కారణం కూడా అవుతున్నది. జగత్తుకు ఉపాదాన కారణం అయిన బ్రహ్మం తప్ప, వేరు నిమిత్త కారణం ఏదీ లేదు" అనే అభిప్రాయాన్ని తెలుపుతున్నది. అంతేకాక, "అద్వితీయమ్ అనే శ్రుతికి ఇంకొక విధంగా కూడా మన పూర్వాచార్యుల చేత అర్థం చెప్పబడింది. ఒక రాజు అద్వితీయుడు అని

కీర్తింపబడితే ఈ మాటకు –ఆతనికి అంతు లేని సంపద, అనుకూలురాలయిన మహారాణి, గుణశాలురు అయిన పుత్రులు, , ప్రేమతో దాస్యం చేసే సేవకులు, వీర్య శౌర్య పరాక్రమాలు ఏమీ లేవు –అనేది అర్థం కాదు కదా. వీటితో కూడిన అతనివంటి ఇంకొక రాజు లేడు– అనేదే అర్థం. ఈ విధంగానే, "బ్రహ్మం అద్వితీయమ్" అని అంటే, దానికి –"బ్రహ్మానికి కళ్యాణ గుణాలు, దివ్య మంగళవిగ్రహం, నియమింపబడే వస్తువులు ఏమీ లేవు –అని అర్థం కాదు. వీటితో కూడిన బ్రహ్మం వంటి ఇంకొక బ్రహ్మం లేదు" అనేదే అర్థం.

## బ్రహ్మం దివ్యమంగళవిగ్రహవిశిష్టం

కళ్యాణ గుణాలతో కూడిన భగవానుడు దివ్యమంగళ విగ్రహంతో కూడినవాడు. "అపాణిపాదో జవనో గ్రహీతా" (చేతులు, కాళ్లు లేనివాడు, వేగంగా వెళ్లేవాడు, గ్రహించేవాడు) అని మొదలైన వేద వాక్యాలలో భగవంతుడు రూపం, ఆకారం లేనివాడు అని వేదం ఒక రీతిలో చెప్పినప్పటికీ కూడా, " హిరణ్యావర్ణః, హిరణ్యశ్మశ్రుః, హిరణ్యకేశః, ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః, తస్య యథాకప్యాసం పుండరీకమేవ మక్షిణీ " భగవానుడు బంగారంవంటి వర్ణాన్ని కలిగినవాడు, బంగారం వంటి కమనీయమైన మీసాలను కలవాడు, గోళ్లు మొదలు అంతా బంగారం వలె కాంతిని కలవాడు. అతనికి అందమైన నీటిలో పుట్టిన, సూర్యకిరణాలతో వికసించిన, బలమైన కాడను కలిగిన తామర పువ్వు వంటి రెండు నేత్రాలు ఉన్నాయి) అనే వేదవాక్యం ఆ భగవానుని గొప్పతనానికి తగినట్లుగా అతనికి దివ్య మంగళ విగ్రహం ఉన్నది అనే విషయాన్ని చెప్పింది. ఈ వేదవాక్యం భగవంతుని భోగ్యమైన దివ్యమంగళ విగ్రహాన్ని గూర్చి పలికి, దానికి లక్షణాలను కూడా తెలియజేస్తున్నది. అందుచేత,

1) "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్" అనే శ్రుతివాక్యంలో ఉండే "అగ్రే" అనే పదం ఈ ప్రపంచం పుట్టడానికి ముందు ఉండే కాలాన్ని చెబుతూ ఉన్నందున, బ్రహ్మంతో విలక్షణమైన వస్తువు ఒకటి ఉన్నది –అనే విషయాన్ని తెలియజేస్తున్నది–అని,

2) ఈ వేదవాక్యంలో ఉండే "ఏకమ్" అనే పదం సూక్ష్మదశలో ఉండే చేతనాచేతనాలు అనే ప్రపంచాన్ని శరీరంగా కలిగి ఉండే బ్రహ్మాన్ని నిర్దేశిస్తునందున, బ్రహ్మానికి (ప్రళయ కాలంలో) సమానమైన వస్తువు లు అయిన, నిత్యమైన జీవాత్మలు ఉన్నాయి, వారువారు చేసిన కర్మలు కూడా నాశం పొందలేదు అని, సూక్ష్మమైన అచిత్ ద్రవ్యం కూడా ఉన్నది, ఆ సమయంలో కూడా భగవంతునకు, చేతనాచేతనాలకు మధ్య శరీరాత్మభావం ఉన్నది– అనే విషయాన్ని తెలుపుతున్నది –అని.

3) ఈ శ్రుతిలో ఉండే "అద్వితీయమ్" అనే పదం కల్యాణ గుణాలు, దివ్య మంగళ విగ్రహం, విభూతులు మొదలైన వాటితో కూడి ఉండే బ్రహ్మానికి సాటి వచ్చే వేరొక తత్త్వం ఏదీ లేదు– అనే విషయాన్ని తెలుపుతున్నందున, బ్రహ్మానికి గుణాలు ఉన్నాయి అనేది స్పష్టపడుతున్నది– అని,

"సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్" అనే శ్రుతివాక్యానికి –బ్రహ్మం అనే తత్త్వం ఒకటే నిజమైన తత్త్వం, ఆ తత్త్వానికి సాటి వచ్చే వస్తువు ఏదీ లేదు, సాటి రాని వస్తువు కూడా ఏదీ లేదు. దానికి గుణాలు లేవు. ఈ విధంగా సాటి వచ్చే వస్తువు, సాటి రాని వస్తువు, గుణాలు లేకుండా, బ్రహ్మం మాత్రం యథార్థమైన తత్త్వంగా ఉన్నందున, ఆ వస్తువు "నిర్విశేషం" (శుద్ధం) అని చెప్పబడుతున్నది. ఈ శ్రుతి వాక్యంలో ఉండే "సదేవ, ఏకమేవ, అద్వితీయమ్" అనే పదాలు బ్రహ్మానికి పోలిన వస్తువులు, పోలని వస్తువులు, గుణాలు లేవు, బ్రహ్మం ఒకటే యథార్థమైన తత్త్వం– అనే అర్థా న్ని తెలుపుతున్నాయి– అని అద్వైతులు చెప్పే అర్థం వైదికుల చేత పరిగ్రహించదగినది కాదు– అనే సత్యం స్థాపితం అయినది.

"ఏకో హ వై నారాయణ ఆసిత్" (ఈ ప్రపంచం పుట్టడానికి ముందు నారాయణుడు ఒక్కడే ఉన్నాడు) అనే మహోపనిషద్వాక్యం –ఈ ప్రపంచం పుట్టడానికి ముందు నామరూపాలు కోల్పోయి, సూక్ష్మమైన దశలో ఉండే చేతనాచేతనాలు అనే నారాలతో కూడిన పరమ పురుషుడు ఉన్నాడు– అనే అర్థాన్ని కలిగినది –అనేది, దీనివల్ల, ఈ శ్రుతి వాక్యం, "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్" అనే వేదవాక్యం ఒకే అర్థాన్ని కలిగినవి అనేది స్పష్టపడుతున్నది.

ఈ విధంగా, బ్రహ్మం అనేది ఏనాటికైనా విశిష్ట బ్రహ్మంగానే ఉన్నది అనే వాస్తవాన్నే శాస్త్రం తెలుపుతున్నది– అని మన స్వామి శ్రీరామానుజులు చక్కగా స్థాపించారు. తటస్థంగా ఉండి మనం చూసినట్లయితే, అద్వైతం అనే సిద్ధాంతం శాస్త్రాలలో చెప్పబడిన తత్త్వార్థాలకు విరుద్ధమైనది –అనేది, విశిష్ట బ్రహ్మమే శాస్త్ర సిద్ధం –అనేది మనకు చక్కగా మనస్సులో పడుతుంది.

ఏ విధంగా పరిహారాలను చూపి, శ్రుతుల అర్థాలను నిర్ణయించడానికి మార్గాలను మన స్వామి శ్రీరామానుజులు చూపించారు? అనే విషయాన్ని మనం తప్పక గమనించి తెలియాలి. శ్రీరామానుజుల గ్రంథాలను ఒక ఆచార్యుని మూలంగా అధ్యయనం చేసి తెలుసుకొని అనుభవించినప్పుడే, ఆ అనుభవ రసం చక్కగా మనసులో ఏర్పడుతుంది. . ఉపనిషత్తులు, శ్రీభగవద్గీత, బ్రహ్మసూత్రాలు– అనే మూడు ప్రమాణ గ్రంథాలు

ప్రస్థానత్రయం అని వ్యవహరింపబడుతున్నాయి. అద్వైతులు కాని, విశిష్టాద్వైతులు కాని, ద్వైతులు కాని, తమ సిద్ధాంతం ప్రామాణికం—అని చెప్పే కాలంలో ఈ మూడు గ్రంథాల నుండి తప్పకుండా ఆధారాలను చూపాలి. వీటిలో, ఉపనిషత్తులలో ఒక విధంగా విచారాన్ని చెయ్యాలి. బ్రహ్మసూత్రాలకు ఒక విధంగా అర్థాన్ని నిర్ణయం చేయాలి. దీనికి అంతటికి పలు మార్గాలను శ్రీరామానుజులు చూపించారు. శ్రీభాష్యకారులు భగవద్గీతకు అనుగ్రహించిన భాష్యాన్ని మనం చక్కగా అధ్యయనం చేసి తెలుసుకోవాలి. వీటిని అన్నిటిని తెలుసుకుంటేనే, "శాస్త్రతాత్పర్యం విశిష్టాద్వైతం" అని, "అది సాక్షాత్తు నారాయణుడే"– అని చెప్పడానికి శ్రీరామానుజులు ఎంత, ఎన్ని ఆధారాలను చూపించారో, ఏం మార్గంలో వెళ్లారో, ఆ విషయాన్ని అందరూ మనమందరం తెలియడానికి సాధ్యం అవుతుంది.

## "తత్త్వమసి" వాక్యార్థం

ఇక అద్వైతులు చెప్పేటట్లుగా, "తత్త్వమసి శ్వేతకేతో! " అనే శ్రుతివాక్యం "ఆత్మ ఒక్కటే సత్యం" అనే అర్థాన్ని చూపదు –అనే విషయాన్ని, కారణ వస్తువు అయిన పరమాత్మ, శ్వేతకేతవును శరీరంగా కలిగి ఉండే పరమాత్మ ఒక్కడే– అనే అర్థాన్ని తెలుపుతుంది–అనే విషయాన్నిచూద్దాం.

"తత్ త్వమ్ అసి" అనే వాక్యం సమానాధికరణ వాక్యం అనబడుతుంది. మొదట, సామానాధికరణ్యం అంటే ఏమిటో తెలియజేసి, తరువాత ఈ శ్రుతి వాక్యానికి కల అర్థాన్ని వివరించి పలుకుతాను.

పదాల సమూహం వాక్యం అనబడుతుంది. 1) రెండు, లేక, పలు పదాలు ఒకే విభక్తిలో ఉండాలి. 2) ఈ పదాలు ఒకే అర్థాన్ని నిర్దేశించే వివక్ష ఉండాలి. ఈ రెండిటిలో ఏ ఒకటి లేకపోయినా సామానాధికరణ్యాన్ని చెప్పడానికి వీలులేదు. ఉదాహరణంగా "శుక్లః, పటః" అనే వాక్యాన్ని గ్రహించి చూద్దాం. ఈ వాక్యంలో "శుక్లః, పటః" అని రెండు పదాలు ఉన్నాయి. ఈ రెండు పదాలు ప్రథమావిభక్తిలో ఉన్నాయి ఈ రెండింటికి ఒకే అర్థాన్ని నిర్దేశించి వివక్ష ఉన్నది. అందుచేత, ఇది సమానాధికరణ వాక్యం అని మనం గ్రహిస్తున్నాము. . ఈ వాక్యంలో ఉండే "శుక్లః" అనే పదం తెల్లని వర్ణాన్ని కలిగిన ద్రవ్యాన్ని, " పటః " అనే పదం వస్త్ర స్వభావాన్ని కలిగిన వస్త్రాన్ని, ప్రథమా విభక్తి రెండు అర్థాలు ఒకటే అనే విషయాన్ని తెలుపుతున్నాయి ఈ విధంగా, రెండు పదాలను, రెండు స్వభావాలను కలిగిన వస్తువు ఒకటే– అనే అర్థాన్ని చూపడాన్ని సామానాధికరణ్యం అని అంటారు. " భిన్నప్రవృత్తినిమిత్తానాం శబ్దానా మేకస్మిన్ అర్థే వృత్తిః సామానాధికరణ్యమ్" అనే లక్షణ వాక్యం ఇక్కడ గమనించదగినది. "పటస్య శుక్లః" అనే ఒక వాక్యం ఉన్నది. ఈ వాక్యంలో కూడా రెండు పదాలను మనం గమనిస్తున్నాం. అయితే, ఈ రెండు పదాలు ఒకే విభక్తిలో ఉన్నవిగా కనబడడం లేదు. కనుక ఇది సమానాధికరణ వాక్యం కాదు. ఇది వ్యధికరణ వాక్యం అనబడుతుంది. ఈ వాక్యంలో ("శుక్లః పటః అనే వాక్యంలో వలె) తెల్లని వర్ణాన్ని కలిగినది, వస్త్రస్వభావాన్ని కలిగినది అయిన వస్తువు ఒకటే– అనే అర్థాన్ని చూడడానికి సాధ్యం కాదు. "వస్త్రం యొక్క తెల్లని రంగు" అనే అర్థాన్నే ఇక్కడ మనం చూడడానికి వీలవుతున్నది. ఒకే విభక్తిలో ఉన్నప్పటికీ వివక్ష లేకపోతే సామానాధికరణ్యం ఉండదు. ఉదాహరణంగా, "పుళ్ళిన్ వాయ్ కీండానై ––కణ్ణనై, పొల్లా అరక్కనై ––రావణనై" బకాసురుని నోటిని

చీల్చిన కృష్ణుని, దుష్టుడైన రాక్షసుడైన రావణుని) అనే ఈ ప్రయోగంలో సామానాధికరణ్యం లేదు.

"తత్ త్వమ్ అసి" అనే వాక్యంలో "తత్, త్వమ్" అనే రెండు పదాలు ఒకే విభక్తిని కలిగినవిగా కనబడుతున్నాయి. "తత్ "అనే పదం కారణమై గొప్ప జ్ఞానాన్ని, గొప్ప శక్తిని కలిగినవాడైన పరమాత్మను, "త్వమ్" అనే పదం శ్వేతకేతువును శరీరంగా కలిగి ఉండే పరమాత్మను, ప్రథమా విభక్తి ఈ ఇద్దరూ ఒకరే అనే అర్థాన్ని తెలుపుతున్నాయి. అందుచేత ఇది కూడా సమానాధికరణ వాక్యం.

సంస్కృత భాషలో ఉండే "శుక్లా శోభనాక్షీ పూర్ణశృంగా గౌః, తామానయ "అనే వాక్యాన్ని తీసుకుందాం. ఈ వాక్యంలో ఉండే "తామ్" అనే పదం –తెల్లని రంగు, అందమైన కన్నులు, నిండు కొమ్ములు– అనే వీటిని కలిగిన గోవును నిర్దేశిస్తున్నవని మనం గమనిస్తున్నాము. కారణం ఏమంటే, ఈ వాక్యంలో ఉండే "శుక్లా శోభనాక్షీ పూర్ణశృంగా గౌః" అనే మొదటి భాగం "తెల్లని రంగు, అందమైన కన్నులు, నిండు కొమ్ములు "అనే వీటితో కూడిన గోవును కదా చెబుతున్నది. "తామ్" అనే పదం కూడా ఆ విధంగా ఉండే పశువునే నిర్దేశించి పలుకుతున్నది. ఈ విధంగానే, "తత్ త్వమ్ అసి "అనే వాక్యంలో ఉండే "తత్ "అనే పదం గొప్ప జ్ఞానం, గొప్ప శక్తి అనే వీటితో కూడి ఉండే, కారణమైన పరమాత్మను చెబుతాయి తప్ప, అద్వైతులు మొదలైన ఇతరులు చెప్పేటట్టుగా శుద్ధాత్మ వస్తువును చెప్పదు. "శుక్లా శోభనాక్షీ పూర్ణశృంగా గౌః, తామానయ" అనే వాక్యంలో ఉండే "తామ్" అనే పదానికి ముందు పశువుకు కల పలు స్వభావాలను తెలిపే పలు పదాలను మనం చూచేటట్లుగానే, "తత్త్వమ్ అసి" అనే వాక్యంలో ఉండే "తత్" అనే పదానికి పూర్వం బ్రహ్మానికే ఉండే పలు గొప్ప అతిశయాలను చెప్పే పలు శ్రుతివాక్యాలను మనం గమనించవచ్చు. ఈ వాక్యాలు ఏవి? అంటే, "ఉత తమాదేశ మాప్రాక్ష్యః, యేన అశ్రుతం శ్రుతం భవతి, ––– విజ్ఞాతమ్ ఇతి" (ఛాందోగ్యమ్– 6–1–3) (వినబడిన ఏ వస్తువు చేత వినబడని అన్ని వినబడుతున్నవి అవుతున్నాయో, మననం చేయబడిన ఏ వస్తువు చేత మననం చేయబడనివి అన్నీ మననం చేయబడినవి అవుతున్నాయో, ధ్యానం చేయబడిన ఏ వస్తువు చేత ధ్యానం చేయబడని అన్నీ ధ్యానం చేయబడినవి అవుతున్నాయో, అన్ని వస్తువులను నియమించే ఆ వస్తువును, అంటే, బ్రహ్మాన్ని గూర్చి నీవు ఆచార్యసన్నిధిలో ప్రశ్నించి తెలుసుకున్నావా?)

"యథా సౌమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్" (మట్టి ముద్దను గూర్చి తెలిస్తే, దాని కార్యవస్తువులైన ఘటం, చట్టి, బాన మొదలైనవి తెలియబడినవి అయినట్లుగానే, బ్రహ్మాన్ని గురించి తెలిస్తే, దాని కార్యం అయిన ఈ ప్రపంచం తెలియబడుతున్నది) ,

"సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్" (ఈ ప్రపంచం పుట్టడానికి ముందు "సత్" అనే వస్తువు ఉన్నది. ఆ వస్తువే ఈ ప్రపంచానికి (కుండకు– మన్ను, కుమ్మరివాడువలె) ఉపాదాన కారణం, నిమిత్త కారణం అవుతున్నాడు) .

"తదైక్షత బహుస్యామ్" ("నేను అనేకంగా కాగలను" అని ఆ సత్ అనే వస్తువు సంకల్పించింది) ,

"అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" (బ్రహ్మం ఒక్కొక్క వస్తువులోనూ జీవుని ద్వారా ప్రవేశించి ఉండి, నామరూపాలను పొందుతున్నది) ,

6) "సన్మూలా ఇమాః ప్రజాః సదాయతనాః సత్ప్రతిష్ఠాః" (ఈ ప్రజలు సత్ అనే వస్తువునే మూలంగానూ, ధరించే వస్తువుగాను నాశనం పొందేటప్పుడు ఒకటిగా ఉండే చోటుగాను పొందుతున్నవి) ,

7) "ఐతదాత్మ్య మిదం సర్వం, తత్ సత్యం, స ఆత్మా" (చేతనాచేతనాలు అనే ఈ ప్రపంచం అనేది" సత్ "అనే వస్తువును ప్రాణంగా ఆత్మగా కలిగినది. అది సత్యం) .

ఈ వాక్యాలను మనం నిశితంగా గమనించి చూసినట్లయితే, సత్ అనే వస్తువు ఈ ప్రపంచానికి నిమిత్త కారణంగానూ, ఉపాదాన కారణంగా అవుతుంది అనే విషయం, ఇది గొప్ప శక్తిని జ్ఞానాన్ని మొక్కవోని సంకల్పాన్ని కలిగినది అనే విషయం, ఆత్మయై ఉండి ఈ అన్ని వస్తువులను ధరించి, ప్రేరేపించి, నడిపే చాలా చాలా ఉన్నతమైన వస్తువు– అనే విషయం స్పష్టంగా ప్రకాశిస్తుంది. దీనివల్ల, "శుక్లా శోభనాక్షీ పూర్ణశృంగా గౌః, తామానయ" అనే వాక్యంలో ఉండే "తామ్ "అనే పదం వలె, "తత్ త్వమ్ అసి "అనే వాక్యంలో ఉండే "తత్ "అనే పదం కూడా, ఈ వాక్యానికి ముందు ఉండే వాక్యాలలో చెప్పబడే, గుణాలతోటి కూడిన బ్రహ్మాన్ని నిర్దేశిస్తుంది– అనేది కూడా స్థాపింపబడినట్లయినది.

"త్వమ్" అనే పదం శ్వేతకేతువులనుశరీరంగా కలిగి ఉండే బ్రహ్మాన్ని నిర్దేశిస్తుంది –అనే విషయాన్ని మన పూర్వాచార్యులు తెలియజేశారు. ఈ విషయంలో శంకా సమాధానాలు ఈ విధంగా ఉన్నాయి.

### శంక

"త్వమ్" అనే పదం శ్వేతకేతువును కదా నిర్దేశి స్తుంది. శ్వేతకేతువును శరీరంగా కలిగి ఉండే బ్రహ్మాన్ని నిర్దేశిస్తుంది– అని చెప్పడం ఏ విధంగా?

### సమాధానం

జగత్తుకు బ్రహ్మానికి మధ్య శరీరాత్మభావం అనే ఒక సంబంధం ఉన్నది అనే విషయాన్ని " యస్య ఆత్మా శరీరం, యస్య పృథివీ శరీరమ్" అనే వేదవాక్యం తెలుపుతున్నది. నియామకమై, ధారకమై, శేషియై ఉండడం ఉండేది ఆత్మకు గల లక్షణం. నియామ్యమై, దార్యమై, శేషమై ఉండడం అనేది శరీరానికి కల లక్షణం. జీవుడు –చేతులు, కాళ్లు మొదలైన అవయవాలతో కూడిన పిండాన్ని ప్రేరేపించి, ధరించి, ఆ పిండం చేసి కార్యాన్ని స్వీకరించి ఆనందిస్తున్నాడు. అందుచేత అతనిని ఆత్మ అని, పిండం అనేది ధరించదగినది, కార్యాన్ని చేయదగినదిగా ఉన్నందున దానిని శరీరం అని తెలుసుకుంటున్నాము. ఈ విధంగానే, పరమాత్మ తనకంటే వేరైన సకల చేతన చేతన వస్తువులను ప్రేరేపించి, ధరించి, ఆ చేతనా చేతనాలు చేసే కార్యాన్ని స్వీకరించి ఆనందిస్తున్నాడు కనుక, అతనిని ఆత్మ అని, చేతనా చేతనాత్మకమైన జగత్తు అనేది ప్రేరేపింపబడదగినది, ధరింపబడదగినది, కార్యాన్ని చేయ తగినదిగా ఉన్నందువల్ల, దానిని శరీరం అని మనం తెలియవచ్చు. . ఈ వాస్తవాన్నే " ఐతదాత్మ్య మిదం సర్వం, తత్ సత్యం, స ఆత్మా" (చేతనాచేతనాత్మకమైన ఈ ప్రపంచం అనేది "సత్ "అనే వస్తువుగానే, ఆత్మగానే ఉన్నది, ఇది నిజం) అనే వేదవాక్యం తెలుపుతున్నది. ఈ విధంగా సాధారణంగా చెప్పబడిన జగత్తుకు, ప్రపంచానికి మధ్య ఉండే శరీరాత్మ భావం అనే సంబంధాన్ని "తత్త్వమసి" అనే వాక్యం అనేది బ్రహ్మను, శ్వేతకేతువును ప్రస్తావించి, మన మనసులో పడేటట్లుగా చెప్పింది– అనేది మనం గ్రహించవచ్చు.

### శంక

జగత్తుకు, బ్రహ్మానికి మధ్య శరీరాత్మ భావం ఉన్నదని, ఈ జగత్తులో ఒకడుగా చేరి ఉన్నందున శ్వేతకేతువు బ్రహ్మానికి శరీరం అవుతున్నాడు అని చెప్పబడ్డది. అయితే, శ్వేతకేతువును నిర్దేశించే పదం బ్రహ్మ వరకు వెళుతుంది –అని చెప్పడానికి ఆధారం ఏమి?

## సమాధానం

శరీరాన్ని నిర్దేశించే పదం శరీరం వరకు మాత్రమే నిలువకుండా, ఆత్మ వరకు వెళుతుంది. శ్వేతకేతువు అనే పదం శ్వేతకేతు యొక్క శరీరాన్ని తెలియజేసి, అంతమాత్రంతో నిలువకుండా, ఆ శరీరాన్ని ప్రేరేపించి ధరించే జీవుని వరకు పోయి అతనిని నిర్దేశిస్తున్నది కదా. శ్వేతకేతువు యొక్క శరీరాన్ని నిర్దేశించే శ్వేతకేతువు అనే పదం శ్వేతకేతువు అనే జీవుని నిర్దేశించేటట్లే, శ్వేతకేతువు అనే జీవాత్మకు వాచకమైన శ్వేతకేతువు అనే పదం ఈ జీవాత్మ అనే శరీరానికి ఆత్మ అయిన పరమాత్మను నిర్దేశిస్తుంది– అనే విషయాన్ని కూడా మనం తెలియవచ్చు. ఈ క్రమంలో, శ్వేతకేతువును నిర్దేశించే "త్వమ్" అనే పదం శ్వేతకేతువును తెలిసి, అతని వరకు మాత్రమే నిలువకుండా, అతనిని శరీరంగా కలిగి ఉండే పరమాత్మ వరకు వెళ్లి, అతనిని తెలుపుతున్నది.

ఈ విధంగా, " తత్త్వమసి" అనే వాక్యంలో ఉండే "తత్" అనే పదం గొప్ప జ్ఞానం, గొప్ప శక్తి కలిగినవాడైన, కారణభూతుడైన భగవంతుని నిర్దేశిస్తున్నది –అనే విషయం, "త్వమ్" అనే పదం శ్వేతకేతువును శరీరంగా కలిగి ఉండే పరమాత్మను నిర్దేశిస్తున్నది అనే విషయం, ఈ వాక్యంలో ఉండే ప్రథమా విభక్తి అనేది ఈ రెండు వస్తువులు ఒకటే అనే అర్థాన్ని తెలుపుతున్నది– అనే విషయాన్ని ఇంతవరకు చెప్పిన దానినిబట్టి చూచాము.

1) అద్వైతులు "సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్", "తత్త్వమసి" అనే వాక్యాలను ప్రమాణంగా చూపించి, ఆత్మ ఒక్కటి మాత్రమే సత్యమైన వస్తువు, ఆ ఆత్మతో పోలిన వస్తువు కాని, పోలని వస్తువు కానీ గుణాలు కానీ, ఏమీ లేవు– అని చెబుతున్నారు – అనేది,

2) మన ఆచార్యులు ఈ ప్రమాణ వాక్యాలనే ఆధారంగా చూపించి "పరమాత్మ నారాయణుడు, అతనితో పోలిన వస్తువులు, పోలని వస్తువులు, గుణాలు ఉన్నాయి" అనే యథార్థాన్ని తెలుపుతున్నారు– అనేది స్పష్టమవుతున్నది.

ఇక, "బ్రహ్మ వా ఇద మేకమేవాగ్ర ఆసీత్" అనే వాక్యం, "ఏకో హ వై నారాయణ ఆసీత్" అనే వాక్యం ఒకే అర్థాన్ని కలిగి ఉన్నాయి –అనే విషయాన్ని చూద్దాం.

బ్రహ్మ శబ్దం, నారాయణ శబ్దం ఒకే అర్థాన్ని తెలియజేసే పదాలు– అనే విషయాన్ని "యతో వా ఇమాని భూతాని –––"అనే శ్రుతివాక్యంలో ఉండే అర్థాన్ని నిశ్చయించే చోట ఒక

విధంగా చూచాము. ఇక, వేరొక క్రమాన్ని అనుసరించి కూడా ఈ రెండు వాక్యాలకు అర్థం ఒకటే–అనే విషయాన్ని గమనిద్దాం.

"పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాత్, నాస్త్యకృతః కృతేన. తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్. సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం, తస్మై స విద్వాన్ ఉపసన్నాయ సమ్యక్ ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ, యేనాక్షరం బ్రహ్మ వేద సత్యం, ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్" అనే ముండ కోపనిషత్ వాక్యాలను ఇక్కడ ప్రస్తావించి చూద్దాం.

వేదాలను, వేదాల అంగాలైన శీక్షా మొదలైనవాటిని చక్కగా అధ్యయనం చేసి తెలుసుకొన్న ఏ పురుషుడు కర్మఫలాలను మీమాంసాన్యాయాల ద్వారా విచారించి, అనిత్యాలైన కర్మలచే నిత్యమైన వరమపురుషుని పొందడం సాధ్యం కాదు అనే విషయాన్ని గ్రహించి నిర్వేదాన్ని పొందుతున్నాడో, ఆ పురుషుడు సమిత్తు మొదలైన వస్తువులను చేతితో గ్రహించి, వేదాంతార్థాలను చక్కగా తెలుసుకున్నవాడు, వరమపురుషుని ప్రత్యక్షంగా దర్శించినవాడైన ఆచార్యుని ఆశ్రయించాలి. బాహ్యేంద్రియాలను, అంతరింద్రియాన్ని నియంత్రించుకున్నవాడైన ఆ పురుషుని ఉద్దేశించి, ఆచార్యుడు తాను ఏ జ్ఞానంతో సత్యమైన, అక్షరమై ఉండే పరమపురుషుని తెలుసుకున్నాడో, బ్రహ్మవిద్యను చెప్పాలి– అనేది ఈ వాక్యాలలోని భావం.

(సత్యం –స్వభావంలో మార్పు లేనివాడు, అక్షరం– రూపంలో మార్పు లేనివాడు)

ఇందుచేత, పురుష శబ్దార్థం, బ్రహ్మ శబ్దార్థం ఒకటే అనేది స్పష్టపడుతున్నది. ఇక, పురుష శబ్దం నారాయణునే నిర్దేశిస్తుంది– అనే విషయాన్ని గమనించి చూద్దాం.

"పురుషః" అనే పదం అన్ని వస్తువులకు కారణమైన భగవంతుని చెబుతున్నది– అనే సంగతిని శ్రుతియే " పూర్వమేవాహం ఇహ ఆసం, తత్ పురుషస్య పురుషత్వమ్" అని వివరించి పలకడానికి మనం గమనించవచ్చు నేను ఉన్నాను ఈ విధంగా ఉండటమే పురుషులకు కల పురుషత్వం అనేది ఈ వాక్యాలకు గల భావం. వీటితో"ఏకో హ వై నారాయణ ఆసీత్" (ఈ లోకం పుట్టడానికి ముందు నారాయణుడు ఉన్నాడు) అనే వాక్యాన్ని చేర్చి చూస్తే, పురుషుడు, నారాయణుడు ఒక్కరే– అనే విషయం స్పష్టమవుతుంది. ఈ విధంగా "బ్రహ్మ వా ఇదమ్ ఏకమేవాగ్ర ఆసీత్" "ఏకో హ వై నారాయణ ఆసీత్" అనే రెండు వాక్యాలకు అర్థం ఒకటే అనేదానిని మనం గమనించాము.

ఇక, "ఆత్మా వా ఇదం ఏకమేవాగ్ర ఆసీత్" అనే వాక్యం, "ఏకో హవై నారాయణ ఆసీత్" అనే వాక్యం ఒకే అర్థాన్ని కలిగినవి– అనే విషయాన్ని కూడా గమనిద్దాం.

"ఆత్మా" అనే పదం, "పురుషః" అనే పదం ఒకే అర్థాన్ని కలిగిన పదాలు అనే విషయాన్ని ఉపనిషద్వాక్యాలనుండే మనం తెలియవచ్చు. తైత్తిరీయోపనిషత్తుకు చెందిన ఆనందవల్లిలో–

1) ఆత్మ ఈ ప్రపంచానికి కారణ వస్తువు అనేది,

2) ఆ ఆత్మ ఆనందమయుడు అనేది,

3) అతడు ఆదిత్య మండలం మధ్యలో ఉండే తామరసనేత్రుడైన పురుషుడు అనేది చెప్పబడినది.

"ఆత్మన ఆకాశః సంభూతః, ఆకాశాద్వాయుః, వాయో రగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోన్నమ్, అన్నాత్ పురుషః" అని ఈ వాక్యాల వల్ల పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశం–అనే పంచభూతాలు, వీటినుండి ఏర్పడిన పాంచ భౌతిక వస్తువులు ఆత్మ నుండి పుట్టినవే –అనే యథార్థం తెలియదగినిది.

2) ఈ విధంగా కారణమైన ఆత్మను ఎటువంటి భ్రమ లేకుండా మనం తెలుసుకునేటట్లుగా, అన్నం, ప్రాణం, మనస్సు, జీవుడు అనే ఈ వస్తువులలో ఆత్మ బుద్ధిని క్రమక్రమంగా కలిగించి, దానిని తొలగించి, చివరిలో, "తస్మాద్వా ఏతస్మా త్ విజ్ఞానమయాత్ అన్యోంతరత్మా ఆనందమయః" అనే వాక్యంతో ఈ ఆత్మ, దుఃఖం ఏమాత్రం లేకుండా, అంతు లేని అధికమైన ఆనంద గుణాన్ని కలవాడు– అనే విషయం చెప్పబడినది.

3) "స య శ్చాయం పురుషే యశ్చాసా వాదిత్యే స ఏకః" అనే వాక్యం ద్వారా "ఆనందమయుడైన ఆదిత్య మండలం మధ్యలో నెలకొని ఉండే తామర పూలవంటి నేత్రాలను కలవాడైన పురుషుడు ఒకడు" అనేది తెలుస్తున్నది.

"య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే, హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశః ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః, తస్య కప్యాసం పుండరీకమ్ ఏవమక్షిణీ, తస్య ఉదితి నామ" అనేది చాందోగ్య ఉపనిషత్తుకు సంబంధించిన శ్రుతివాక్యం వల్ల "ఆదిత్య మండలం మధ్యలో ఉండేవాడైన పురుషుడు అందమైన తిరుమేనిని కలవాడు, అప్పుడే వికసించిన ఎర్రని తామర పువ్వువంటి రెండు నేత్రాలను కలవాడు, అతనికి "ఉత్" అని పేరు అనే అర్థాన్ని

గమనించవచ్చు. ఈ అర్థాలను చూస్తే, తామర పూలవంటి నేత్రాలను కలవాడైన పురుషుడు ఆనందమయుడైన ఆత్మ. అతడు ఈ ప్రపంచానికి కారణమైనవాడు– అనే విషయం, అతడు నారాయణుడు అనే విషయం చక్కగా ప్రకాశిస్తుంది. పురుష శబ్దం, నారాయణ శబ్దం, రెండు కూడా ఒకే అర్థాన్ని నిర్దేశిస్తాయి –అనే విషయం కూడా మనం ఇంతకుముందే తెలిసి కొన్నాము కదా.

నారాయణుడే పుండరీకాక్షుడు అనే విషయం

నారాయణుడు ప్రతి దినం వేయి తామర పువ్వులతో శివుని ఆరాధిస్తున్నట్లు, ఒకనాడు అతని భక్తిని పరీక్షించడం కోసం ఒక తామర పువ్వును శివుడు కనపడకుండా చేసినట్లు, అప్పుడు అర్చన చేసే నారాయణుడు తామర పూల వంటి నేత్రాలను కలిగినవాడు కనుక, తక్కువ అయిన ఆ తామర పువ్వుకు బదులుగా తన నేత్రం అనే తామర పువ్వుతో అర్చించినట్లు, అందువల్ల ఆనందించిన శివుడు నారాయణుడునకు చక్రాయుధాన్ని ఇచ్చినట్లుగాను శైవపురాణం తెలుపుతున్నది.

ఇంతే కాక ఆధునిక శైవ కవి ఒకడు "కంజలోచన పూజ్యాయ కస్మైచిన్మహసే నమః" అని అంటూ నారాయణుని తామరపూలవంటి నేత్రాలను కలవాడుగా కీర్తించాడు.

తిరువళ్లువర్ అనే కవి కూడా నారాయణుడు పుండరీకాక్షుడు అనే సత్యాన్ని "కతామ్ వీళ్ళువార్ మెన్టొట్టియిలినినిదు కొల్ తామరైక్కణ్ణానుక్కు" అని ఒక విధంగా కీర్తించాడు. ఇక్కడ "మహానందాన్ని ఇచ్చే మోక్షభూమి అనేది పుండరీకాక్షునిదే" అనే అర్థాన్ని గమనించవచ్చు.

4) మహాపండితుడైన కంబమహాకవి కూడా "తయరదన్ మదలై ఎన్బార్, తామరెక్కణ్ణన్ ఎన్బార్" (దశరథ కుమారుడు అని అంటారు, తామర పువ్వులవంటి కన్నులను కలిగినవాడు అని అంటారు) అని అన్నాడు. ఈ వాక్యంలో నారాయణుని పూర్ణావతారంగా కీర్తింపబడే శ్రీరామచంద్రుడు తామర పువ్వులవంటి నేత్రాలను కలవాడు– అని అతడు స్తుతించడాన్ని మనం చూడవచ్చు.

5) పరమాచార్యులైన నమ్మాళ్వారులు కూడా "నారాయణుడు పుండరీకాక్షుడు" అనే విషయాన్ని

6)

"తగుమ్ శీర్ తన్ తనిముదలినుళ్ళే మిగుమ్ దేవుమ్ ఎప్పొరుళుమ్ పడైక్క
తగుమ్ కోల త్తామరైక్కణ్ణన్ ఎమ్మాన్ మిగమ్ శోది మేలఱివార్ ఎవరే?" (తిరువాయి మొళి–2–2–5) అనే పాశురంలో అనుగ్రహించారు.

సృష్టించడం, రక్షించడం, లయం చేయడం –అనే ఈ మూడు కార్యాలకు తగిన గొప్ప జ్ఞానం, గొప్ప శక్తి అనే వీటిని కలవాడైన భగవానుడు, తన సాటి లేని, ఈ ప్రపంచానికి మూలమైన సంకల్పంతో, "ఈశ్వరులా? "అని శంకింపబడే బ్రహ్మాదులైన దేవతలను అందరిని, , మిగిలిన వస్తువులను సృష్టించడం ఇతనికే తగినది– అనే విషయాన్ని తెలియజేసే తామరపూలవంటి నేత్రాలను కలిగిన, నా స్వామి అయిన పరమ పురుషుని కంటే గొప్ప జ్యోతిస్సు అయిన యథార్థమైన తత్వం వేరొకటి ఉన్నది –అని తెలిసిన వైదికులు ఎవరున్నారు?" –అనేది ఈ పాశురంలోని తాత్పర్యం.

ఇంతవరకు చెప్పినదానిని బట్టి, నారాయణుడే పుండరీకాక్షుడైన పురుషుడు అనే విషయాన్ని ఆదిత్య మండలం మధ్యలో నెలకొని ఉండే అతడు ఆనందమయుడైన ఒక తత్త్వం, అనే విషయాన్ని, ఆ ఆనందమయుడే ఆత్మ అనే విషయాన్ని తెలుసుకున్నాము. ఇందువల్ల,

"సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్",
"బ్రహ్మ వా ఇదమేకమేవాగ్ర ఆసీత్",
"ఆత్మా వా ఇదమేకమేవాగ్ర ఆసీత్",

అనే ఈ మూడు కారణ వాక్యాలకు "ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మ నేశానః" అనే మహోపనిషద్వాక్యానికి ఉండే అర్థం ఒకటే–. అని స్థాపింపబడినది. నారాయణుడే ఈ ప్రపంచానికి కారణం– అనే యథార్థాన్ని ఇక్కడ మనం సారమైన అర్థంగా తెలిసికొన్నాము. ఇంకా చెప్పవలసిన, సారమైన అర్థాలను "విశిష్టాద్వైతం –2" అనే శీర్షికలో విజ్ఞాపించగలను.

★★★★★